# కురంగ గౌరీశంకర నాటిక

## మహాకవి దాసు శ్రీరాములు

ప్రకాశకులు
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
వాణీసదనము, 3-4-885/A, బర్కత్‌పురా,
హైదరాబాదు - 27.

# కురంగ గౌరీశంకర నాటిక

## మహాకవి దాసు శ్రీరాములు

ప్రకాశకులు

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

వాణీసదనము, 3-4-885/A, బర్కత్‌పురా,

హైదరాబాదు - 27.

# ముందు మాట

మహాకవి దాసు శ్రీరాములుగారు క్రీ.శ. 19 వ శతాబ్ది ఉత్తరార్థమున తెలుగు దేశమున జన్మించి ఆంధ్ర సాహిత్యమును తమ అమూల్యమైన రచనలచే నలంకరించిరి. శతకములు, ప్రబంధములు, పురాణములు, నాటకములు, శాస్త్రగ్రంథములు, కృతులు, జావళీలు- ఇట్లెన్నో ప్రక్రియలలో వారు రచనలు గావించి యుండిరి. శ్రీరామకవీంద్రుల గ్రంథములు పునర్ముద్రించి పాఠకలోకమున కందించు దృష్టితో వారి వంశమున జన్మించిన మేమందరము కలిసి "మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి"ని హైదరాబాదులో 1973 వ సంవత్సరములో స్థాపించితిమి.

మా ప్రచురణలలో మొదటిది తెలుగువారి నాటి ఆచారవ్యవహారములను దెలియుట కుపకరించు పద్యగ్రంథము "తెలుగునాడు". రెండవది వారి వచనకృతి "అభినవ గద్యప్రబంధము". తదుపరి వారి జయంతి సంచిక 1975 లో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, డా॥ పాటిబండ మాధవశర్మ మున్నగు ప్రఖ్యాత రచయితల వ్యాసములతో "ప్రపంచ తెలుగు మహాసభల" సందర్భములో ప్రచురించితిమి.

ఆంధ్రదేశములో అనన్యమైన ప్రాశస్త్యము పొంది గ్రంథకర్తకు 'మహాకవి' యను బిరుదమును సమకూర్చిన "శ్రీదేవీ భాగవతము"ను ముద్రించి ప్రచురింపగల్గిన సుకృతము మా సమితికి కలిగినది. తదుపరి మయూరకవి సంస్కృతమున రచించిన 'సూర్యశతకము' తెలుగు అనువాదము తాత్పర్య సహితముగా ప్రచురించితిమి.

మా ప్రస్తుత ప్రచురణ శ్రీరామకవిచే రచింపబడిన "కురంగ గౌరీ శంకర నాటిక". ఈ నాటిక ప్రథమ ముద్రణ చేసి ప్రచురించు సదవకాశము మా సమితికి దక్కినది. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు మేము అడిగిన తోడనే విశదముగా పీఠిక వ్రాసి యిచ్చినందుకు వారికి మా సమితి కృతజ్ఞతాభివందనములు.

విజయవాడ
12-7-1981

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి



మహాకవి దాసు శ్రీరాములు

1846—1908.

# 'అభినవ భాసుడు'

కీ. శే. దాసు శ్రీరామకవి రచించిన స్వతంత్రరూపకములలో నిది యొకటి. కురంగము కారణముగా నైన గౌరీశంకరుల వివాహ మిందు వస్తువగుటచే దీనికి కురంగ గౌరీశంకర నాటిక అను పేరు సార్థక మగుచున్నది. నాల్గంకముల పరిమితినిబట్టి యిది నాటిక యని పిలువబడుచున్నది.

ఆకృతి కీ నాటిక చిన్నదైనను అపూర్వకల్పనలచే మిన్నగా భాసించుచున్నది. భాసమహాకవియే తెలుగుబాసపై మమకారముతో ఒక తెలుగు కవియై పుట్టి ఈ నాటిక రచించినాడా యను నంతటి యబ్బురపాటు పఠితలకు ఈ సుకృతి కలిగించుచున్నది.

ఈ నాటికయందలి వస్తువు పార్వతీ పరమేశ్వరుల పరిణయగాథ. ఇది పురాణప్రసిద్ధమైనది. కాళిదాసాది మహాకవులచే సంస్కృతమునందు కావ్యముగాఁ దీర్చిదిద్దఁబడినది. నన్నెచోడాది ఆంధ్రకవుల కావ్యములకు వస్తుగౌరవము కలిగించినది. పూర్వకవులు కుమార సంభవమును, తారకాసుర సంహారమునుగూడ గ్రహింపగా శ్రీరామకవి పార్వతీ పరిణయ పర్యంతముగ నీ వస్తువును నిర్వహించి నాటికను మంగళాంత మునర్చినాడు.

ఈ నాటికలో దాసు శ్రీరామకవి గావించిన కల్పనలు వారి ప్రతిభకు ప్రమాణములై ప్రశంసాపాత్రము లగుచున్నవి. ఆ కల్పనల ఔచిత్యసార్థక్యములను బరిశీలించుటకు ముం దీ నాటికలోని కథా సారాంశమును దెలియుట యవసరము.

# కథా సంగ్రహము

దక్షాధ్వరధ్వంస మైన తరువాత పరమశివుడు మందరగిరి శిఖరముపై నొక వటవృక్షముక్రింద యోగసమాధియందు నిలచియుండెను. సతీదేవి మేనకాహిమవంతులకు పుత్రికయై పుట్టి నారదప్రబోధమువలన శివునియం దనురక్తయై అతనిని పతిగా పొంద నెంచి తల్లిదండ్రుల యనుమతి వడసి హిమవంతము వీడి వచ్చి, బదరికాశ్రమము చేరి, అందు పర్ణశాలను నిర్మించుకొని శివధ్యానపరాయణయై యుండెను. హైమవతివెంట ఆమెకు పరిచర్యలను చేయుటకై జాలా సుందరులను చెలులుకూడ వచ్చియుండిరి. ఒకనాడు గౌరి శివుని ధ్యానించుచు నొడలు మఱచి యుండగా దుర్వాసమహర్షి పర్ణశాలకు వచ్చెను. పార్వతి ధ్యానసమాధిలో నుండుటచే నామహర్షికి అతిథిసత్కారములు చేయలేదు. చెలికత్తెలు పూలను దెచ్చుటకై వనాంతరమునకు వెడలియుండిరి. దుర్వాసమహర్షి గౌరి తనకు మర్యాదలు సేయలే దని కోపించి యామె ధ్యానించువానిస్థాన మామెకు పొడగడ్డ కుండు నటుల శపించెను. అంతలో చెలికత్తె లాశ్రమమునకు వచ్చి, జరిగినదానిని దెలిసికొని, యపరాధమును క్షమింపు మని యా జడదారిని ప్రార్థించిరి. దుర్వాసుడు వారి ప్రార్థనను మన్నించి వరదుడై "గౌరిచే పెంపబడిన లేడిపిల్ల యొకటి శివుని సమీపమును జెరెనేని శంకరు డున్నచోటు గౌరికి బొడగట్టు"నని శాపమోక్షమును సూచించి వెడలెను. చెలికత్తెలా శాపవృత్తాంతమును గౌరికి తెలియజెప్పకుండ దాచియుంచి, శాపమోక్ష మగు తరుణముకొరకై వేచియుండిరి. పార్వతి నాటినుండి శివు డున్న చోటు స్ఫురింపక వేదనపడుచు వాయుజలభక్షణవ్రతమును బూని కఠోరతప మాచరింప నారంభించినది. ఇది నాటికలోని కథకు పూర్వరంగము.

ఒకపరి పార్వతి కల్యాణలక్ష్మీవ్రతమును జేయ పూనుకొనెను. దానిమహిమవలన పరమేశ్వరునితోఁ దనకు కల్యాణ మగు నను నాశతో నుండెను. అట్టితరి ఆశ్రమ సమీపారణ్యమునుండి యొక లేడిపిల్ల ప్రాణ భయముతో పరుగుపరుగున వచ్చెను. దయామయురాలైన గౌరి ఆలేడి పిల్లను పట్టుకొని ఆశ్రమమునందు రక్షణగల్పింపు డని తన నెచ్చెలులను ఆజ్ఞాపించెను. వా రాలేడిపిల్లను బట్ట నేగిరి. ఒకబోయవా డా హరిణ మును బాణముతో కొట్టవలె నని విల్లెత్తి వెన్నంటి వచ్చుచుండెను. బాలా సుందరు లా బాలహరిణమును పొదివి పట్టుకొని బోయవానికి జీవహింస తగ దని బోధించి దయాప్రాశస్త్యమును గూర్చి యుపన్యసించిరి. వారి మాటలను లెక్కసేయక బోయవాడు బాణము వేయబోగా తిరస్కరణీ మంత్రప్రభావముచే చెలికత్తెలు లేడిపిల్లను రక్షించి, దానిని పార్వతి యొద్దకు తెచ్చిరి. బోయవాడు నిరాశతో తిరిగి వెడలిపోయెను. పార్వతి యాలేడిపిల్లను ప్రాణముకంటె నధికముగా ప్రేమించి పెంచుచుండెను. ఇది ప్రథమాంకమునందలి కథ.

ఇది యిట్లుండ తారకాసురు డను దానవుడు వరగర్వితుడై సప్త దిక్పాలకుల నోడించి తనకు దాసులుగా నొనర్చుకొని, ఇంద్రునిపై దాడి వెడలి స్వర్గము నాక్రమింపవలె నని సన్నాహములు చేయుచుండెను. దిక్పాలకులవలన తారకుని దుండగములను వినిన దేవేంద్రుడు దేవగురు వైన బృహస్పతిని తారకాసుర వధోపాయమునుగూర్చి ప్రశ్నించెను. శివ పార్వతులకు జనించు కుమారస్వామియే తారకాసురుని సంహరింప గలవా డనియు, పార్వతీపరమేశ్వరుల పరిణయ మగునట్లు యత్నించు టయే తత్క్షణకర్తవ్య మనియు బృహస్పతి సూచించెను. ఇంద్రుడు మన్మ థుని స్మరించి యాతని ప్రసన్నుని చేసికొని పరమేశ్వర తపోభంగ మొనర్చి పార్వతిని శివుడు చేపట్టునట్లు యత్నింప నియోగించెను. మన్మ

థుడు దేవహితమును దలంచి ఆ దుష్కరకార్యమునకు వసంతసహాయుడై ఉద్యమించెను. (ఇది ప్రథమరంగము.)

వసంత మన్మథులు మందరనగము చేరి వీరాసనస్థుడై యోగ సమాధియం దున్న పరమేశ్వరుని దర్శించిరి. అతని తపోభంగ మసాధ్యముగా మదనుడు భావించి లోలోన భయపడసాగెను. వసంతుడు నారదునివలన గౌరికిఁ గలిగిన దుర్వాసుని శాపమునుగూర్చి వినియుండెను. ఆ కథ నంతయు నాతడు మన్మథునికి చెప్పి నారాయణుడే లేడిపిల్ల యనియు, బ్రహ్మయే కిరాతుడై ఆలేడిపిల్లను పార్వతికడకు చేర్చెననియు, తారకాసుర వధాపేక్షచే వా రట్లు చేసిరనియు స్పష్టపరచెను. ఆ రహస్యము దేవేంద్రునకు తెలియదనియు పేర్కొనెను. పార్వతి పరమేశ్వరుని సమీపమునకు చేరవలె ననినచో నా లేడిపిల్లను మాయోపాయమున గ్రహించి యా మహాదేవుని వెనుక నుంచవలెననియు, ఉపాయాంతరమున గౌరి నక్కడకు రావింపవలె ననియు నొక యుపాయమును వసంతుడు సూచించెను. మన్మథు డందుల కంగీకరించెను. (ఇది రెండవ రంగము.)

మన్మథు డొక కుంటి బ్రహ్మచారిరూపమును ధరించి, పార్వతి యాశ్రమమున కన్నాతురునిగా జేరి, యామె యిచ్చిన అతిథిసత్కారములఁ బొంది యుండెను. వసంతుడు తన ప్రభావముచే నాశ్రను వనమును వసంతఋతు శోభాపూర్ణముగా నొనర్చెను. పార్వతి ఋతుకాలప్రభావముచే పరమేశ్వరునిపై విరాళి నొంద నారంభించెను. ఆమె మదనబాధాపీడిత యయ్యెను. ఆమెకు చెలికత్తెలు శైత్యోపచారములు సేయుచు హరిణరక్షణమును బ్రహ్మచారికి నొప్పగించిరి. పార్వతి మదనతాపాధిక్యముచే మైమరచి మైకమునందు పడెను. ఆమె కప్పు డొక స్వప్నము వచ్చెను. లేడిపిల్ల పారిపోయి శివుని వెన్క నిలిచినట్లు, ఆ హరిణము చనినజాడలో నాకాశగమనమున గౌరియు, చెలికత్తెలును శివునికడకు చేరి

యాతనిని వేడుకతో పూజించుచున్నట్లును, మదను డాసమయమున శివుని పై పుష్పబాణములు విసరినట్లును, హరుడు కోపించి మూడవకంటి మంటతో మదనుని దగ్ధ మొనర్చినట్లును, ఆపై పశ్చాత్తప్తుడై శివుడు పార్వతిని వివాహమాడ కోరినట్లును, అటుపై పార్వతి తండ్రియింట పరమేశ్వరుని పరిణయ మాడినట్లును, కలలో నా కన్యకు స్ఫురించెను. చెలికత్తె లాస్వప్నము భావిమంగళసూచక మని గౌరికి తెల్పిరి. అంతలో మరు డాహరిణమును హరించి హరునివెనుక నుంచినట్లు ఆకాశవాణి పల్కెను. ఆవార్త వినినతోడనే గౌరికి తొల్లిటి దివ్యజ్ఞానము స్ఫురించెను. సదాశివుని యునికి ఆమెకు గనుపట్టెను. అచ్చట కేగుటకై వారందరు సిద్ధమైరి. చెలికత్తె లాయదను కనిపెట్టి దుర్వాసశాపవృత్తాంతమును గౌరి కెరిగించి, శాపవిమోచనమై యామెకు శుభములు చేకూరనున్న వని సూచించిరి. గౌరియు సంతసించెను. (తృతీయరంగము). ఇది ద్వితీయాంకమునందలి కథ.

పార్వతి పరమేశ్వరుని సన్నిధానమును జేరి పూలదండలతో నా దేవదేవుని పూజింప సాగెను. లేడిపిల్ల ఆదేవుని వెనుకనే యుండెను. పార్వతి పూజచేసిన మల్లెపూదండ యొకటి శివునిజడలో చిక్కుకొనెను. గండుతుమ్మెద యొకటి దానిపై మసలసాగెను. శివున కాతుమ్మెదవలన బాధ కలుగునేమో యని యతని వెనుక కేగి యాతుమ్మెద నదలించుచు నాతని జడను తాకెను. అంతలో మదనుడు మహేశ్వరునిపై విరితూపులు సంధించెను. శివుడు సమాధి వీడి క్రుద్ధుడై యాతనిని మూడవ కంటి మంటతో బూది చేసెను. రతీదేవి యాకసమునుండి దిగివచ్చి పతిపాటు నెంచి విలపించి, సహగమనమునకు చితిని పేర్చుకొని, పరమేశ్వరుని ప్రార్థించెను. పరమశివు డామెయందు దయామయుడై ఆమె కామెపతిని ప్రసాదించెను. శివునివరముచే రతికి మన్మథు డాకృతితో కనుపడినను

లోకమున కాత దనంగుడే యగును. రతీమన్మథులు శివునకు ప్రణమిల్లి నిష్క్రమించిరి.

శివు డంతట గౌరిని గాంచి, యామెయందమునకు ముగ్ధుడై వలపు బాసల నామెతో సరసమాడ నారంభించెను. పతి యనుకూలు డైనందుల కామె లోలోన సంతసించియు ముగ్ధాభావముచే నాతని కౌగిలిని వారించి కురంగము నిమ్మని కోరుకొనెను. అంతలో కురంగము నారాయణునిగా మారి వారికి త్వరలో వివాహము కాగలదని సూచించి, ఇరువురిని సంతోష పెట్టెను. ఇది తృతీయాంకమునందలి కథ.

హిమవంతున కీసంగతి తెలిసి, పార్వతిని తనయింటికి తెచ్చుకొని వివాహయత్నములు సాగించెను. కొడుకు లైన మైనాక కోలాహలుల్తను పెండ్లిపిలుపులకు పంపించెను. బాలాసుందరులను శుక్తిమతీకోలాహలుల పుత్రిక యగు గిరికను తెచ్చుటకు పంపించెను. తాను హిమజాడ్యముతో బాధపడుచున్నను నారాయణదేవు నారాధించుచు శుభకార్యనిర్వహణ మునకై యత్నము సాగించెను. పరమేశ్వరుడు తనకల్లు డగుట పూర్వ పుణ్యవిశేష మని యెంచి భక్తిప్రపత్తులతో పరమేశ్వరుని గీర్తించెను. (ఇది మొదటిరంగము.)

కైలాసమున పరమేశ్వరుడు భృంగిమొదలగువారికి తన పార్వతీ ప్రణయవృత్తాంతము తెల్పి పరిణయసన్నాహము లొనర్చు ముచ్చట లాడు చుండెను. అంతలో సప్తర్షులు లగ్నపత్రికను తెచ్చి పరమేశ్వరున కర్పించిరి. వివాహయాత్రకు శివు డంగీకరించెను. (ఇది రెండవరంగము)

గౌరి వివాహముహూర్తముకొరకై వేగిరపడుచు, విరాళితో వేగుచు, శివలింగ ప్రతిష్ఠ గావించి పూజించుచుండెను. చెలికత్తె లగు మాలతీవకుళ మాలికలు శివపూజాద్రవ్యములను సమకూర్చుచుండిరి. పార్వతి 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' అను మహావాక్యార్థము నెంచి శిలలో శివుని భావించి

ధ్యానమును దాల్చెను. నాటిమాపటికే శివపార్వతుల వివాహ మనియు, నారాయణు డా కార్యమున కాధ్వర్యవము వహించు చున్నాడనియు ప్రకటింపబడెను. గౌరిని పెండ్లికూతురుని జేయుటకై చెలికత్తె లామెను అంతఃపురమునకుఁ గొంపోయిరి. (ఇది మూడవరంగము)

గౌరీశంకరులకల్యాణము జగన్మోహనముగా జరిగెను. బ్రహ్మ విష్ణువులు, ఋషిలోకము, దేవగణములు మొ॥ వారెల్లరు కల్యాణోత్సవము తిలకించి ఆనందించిరి. ఋషిపత్నులారతు లిచ్చి మంగళగీతములు పాడిరి. బ్రహ్మదేవుడు భరతవాక్యము పల్కెను. కథ శుభాంతమయ్యెను. (ఇది చతుర్థాంకమునందలి కథ)

## కల్పనల సార్థక్యము

కుమారసంభవాది కావ్యములందుఁ గానవచ్చు కథను గైకొనినను, దాసు శ్రీరామకవి దానిని విచిత్రకల్పనలతో విశిష్టము గావించెను. ఆ కల్పనలలో ముఖ్యమైనవి 1. కురంగవృత్తాంతము, 2. దుర్వాసశాప వృత్తాంతము. శివపార్వతుల వివాహము జరుపుటకు బ్రహ్మయు, విష్ణువును కంకణము కట్టుకొనినారు. అందు బ్రహ్మ ప్రేరకుడు, విష్ణువు సూత్రధారుడు. బ్రహ్మ కిరాతుడై, కురంగరూపుడైన విష్ణువును పార్వతి యొద్దకు చేర్చినాడు. వసంతప్రేరితుడైన మదను డాలేడిపిల్లను శివుని కడకుఁ జేర్చినాడు. మదనుని నియోగించినది ఇంద్రుడు. ఇట్లు దేవతలే దేవదేవుని వివాహమునకు కారకులైరి ఈ నాటికలో పార్వతి దివ్యజ్ఞానము గల వధువు. ఆమెకు దుర్వాసుని శాపమువలన దివ్యదృష్టి కుంఠితమైనది. కురంగము శివునియొద్దకుచేరుటతో నామెకు దివ్యదృష్టి తిరిగి లభించినది. ఇట్లు కథాగతికి, ఫలసిద్ధికి కురంగము కారణ మగుటచే కురంగకల్పనము ప్రధాన మగుచున్నది. చేసినకల్పనములకు సమగ్ర సార్థక్యమును గలిగించుటచే కవిప్రతిభ ప్రశంసనీయ మగుచున్నది.

దాసు శ్రీరామకవి చేసిన పైరెండు కల్పనలకును కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతల నాటకము ప్రేరణ నిచ్చినదని స్పష్టమగుచున్నది. హరిణమును వెంటాడుచు కణ్వాశ్రమప్రాంతమునకు వచ్చిన దుష్యంతునిపై శానసులు వారించి హరిణహింసను మాన్పిన సన్నివేశము లేడిపిల్లను వేటాడుచు వచ్చిన కిరాతుని వారించి బాలాసుందరు లామృగమును రక్షించిన సన్నివేశమునకు ప్రేరణ నిచ్చియుండును. శాకుంతలమున దుర్వాసుని శాప మెట్టి ప్రయోజనమును సాధించినదో ఈనాటిక యందును నట్టి ప్రయోజనమే సాధించినది. భేద మేమనగా అచ్చట మఱపు నాయకునకు, ఇచట దివ్యదృష్టి నశించుట నాయికకు. అక్కడ అభిజ్ఞానమగు ముద్దుటుంగరము జ్ఞాపకహేతువు, ఇచట హరిణము జ్ఞాపకహేతువు. ఇట్లు కాళిదాసకల్పనలను కథాసూత్రమునకు జీవతంతువులుగా గ్రహించినను వానిని కథాప్రపత్తి కనుగుణముగా కథాగతికి మార్చి పోషకములుగా నత్యంత సహజముగా ననుసంధించుకొనుటలో కవి తన ప్రతిభావిశేషమును ప్రకటించినాడు.

ప్రసిద్ధమైన ఈ కథలో ప్రయోజన మర్థించి కవి మరికొన్ని మార్పులనుగూడ చేసినాడు. ప్రసిద్ధకథలో మదనదాహనంతరము పార్వతి తపస్సున కుపక్రమించిన ట్లుండగా నీ నాటికలో మొదటనే ఆమె తపస్సు నారంభించినట్లు కల్పింపబడినది. బదరికాశ్రమమునం దామె తపోవ్రతమును చేపట్టుటకు కారణ మీనాటికయందు వాచ్యము కాకపోయినను, అది నారాయణపుణ్యక్షేత్ర మగుటచేతను, హిమవంతుడు హరిభక్తుడగుటచేతను ఆమె ఆయాశ్రమమును తపమున కనుకూలక్షేత్రముగా నెన్నుకొనిన దని భావించుటకు వీలు కలుగుచున్నది. శివపార్వతుల వివాహమునకు నారాయణుడే ప్రయోక్తగా నీ నాటికయందు కవి చిత్రింపదలచుటచే నిట్టి కల్పనము సార్థక మగుచున్నది.

ఈ నాటికయందు నాయకుడు శివుడు. నాయిక పార్వతి. శివుని పాత్ర ప్రసిద్ధకథలో నున్నంత ఉదాత్తముగా నిందు పోషింపబడలేదు. మదనదాహానంతరము శివుడు పార్వతితో సల్పిన సంభాషణము శృంగార నాయకున కనువుగా నున్నది కాని, ధీరశాంతుని చిత్తవృత్తి కుచితముగా లేదు. కపటబ్రహ్మచారివేషమున శివుడు పార్వతియొక్క పరమేశ్వర భక్తిశక్తిని పరీక్షించిన ఘట్ట మిందు లేకుండుటచే ఈశ్వరుని అష్టైశ్వర్య మహిమను నాయకుడు తనంతట తానే భృంగితో చెప్పుకొనవలసి వచ్చి నది. ఆత్మగుణస్తుతి ఉదాత్తునిగుణము కాదుకదా మరి! ఈ నాటికయందు భృంగి విదూషకతుల్యు డగుట విచారము. గణప్రముఖు డయ్యు పర మేశ్వర గుణగణములను దెలియని మందమతిగా, పరిణయముకొరకు పరితపించు విటశేఖరునిగా నాతడు చిత్రింపబడుట చదువరులకు సంత సము నీయజాలక పోయినను నాటికలో హాస్యము పోషింపబడుటకు మాత్రము తోడుపడిన దని చెప్పక తప్పదు.

ఇక పార్వతి ఈ నాటికలో ముద్దరాలు. పతిని పొందుటకై తపము చేసిన ధీరురాలు. కురంగమును రక్షించిన దయామయురాలు. పతి తనపై వలపు చూపి నెకసక్కెము లాడునెడ ముగ్ధవలె లజ్జను ప్రకటిం చిన శృంగారనాయిక. శివునిరూపము నెంత వలచెనో శివతత్త్వము నంత గ్రహించిన వివేకవతి. పతికి తగిన సతివలె నిందు చిత్రింపబడినది.

ఈనాటిక శివపార్వతుల వివాహముతో ముగియుట యొక విశే షము. పెండ్లి యైనచో కుమారస్వామి పుట్టుటయు, నాతడు తారకాసురుని వధించుటయు జరుగు నని ప్రబంధధ్వని. కథ సాగినచో నాటిక నాటక మగునని కవి ఈ ముచ్చటైనముగింపు చేసియుండును.

శివపార్వతుల వివాహకథయందు శాంతగుణ ముద్రితమైన ఆధ్యా త్మికశృంగారము రసముగా నిలచుట ప్రసిద్ధకథాప్రవృత్తి. దాసు

శ్రీరామకవి అట్టి ఉదాత్త రసస్థితికంటె ఒక మెట్టు తక్కువదియైన భక్తి భావముద్రితమైన శృంగారము నిందు పోషించినాడు. నాటికయం దిట్టి రసపోషణమే సమంజస మని కవి భావమై యుండవచ్చును. ప్రసిద్ధ కథలో పార్వతి స్వీయతపోగుణశక్తిచే పరమేశ్వర ప్రణయసిద్ధిని పొంది నట్లుండ, కవి ఈనాటికలో పార్వతి నారాయణసహాయమున స్వీయకార్య మును బొందినట్లు చిత్రించినాడు. పార్వతియందు విరహమును విశేషించి పోషించుటచే నామె తపస్విని యైన శృంగారనాయికవలె నిందు భాసించు చున్నది. నాయకప్రవృత్తి కామె కనుగుణముగా తీర్చిదిద్దబడినది. ఇట్లు రసికజనమనోరంజనము నర్థించి కవి యిట్టి రసపోషణవిధానము ననుస రించె నని భావించుట యుచితము.

ఈనాటికలో రచయిత సందర్భము ననుసరించి స్త్రీవిద్యావశ్య కతను (పుట 57), అధికవ్యయము లేని అక్షతావివాహాచారమును (పుట 54) సమకాలీన సమాజమునకు సంస్కరణ దృష్టితో ప్రబోధించి నాడు. సాంబశివుని కథయందు సాంఘిక విషయములను నిపుణముగా ననుసంధించుట శ్రీరామకవి సామర్థ్యము.

మొత్తముమీద నాటిక ముచ్చటగా నున్నది. రచన సరళమధు రముగా నున్నది. నిర్మాణము సలక్షణముగా నున్నది. పద్యములు, పాటలు పాత్రోచితముగా ప్రయోగింపబడియున్నవి. కథ ప్రాతదయ్యును కల్పనలచే క్రొత్తరుచుల నీనుచున్నది. ఈ నాటకము చదివిన సహృద యులు దాసు శ్రీరామకవిని 'అభినవ భాసుని'గా హృదయములందు సంభావించి గౌరవింపగలరు.

దీనిని రచించిన శ్రీరామకవి వందనీయుడు. దీనిని ప్రచురించిన దాసు వంశజులు అభినందనీయులు. నాకీ ముందుమాట వ్రాయు నవకాశ మిచ్చిన దాసు శ్రీరామకవి స్మారక సమితికి నా కృతజ్ఞతలు.

హైదరాబాదు
8–7–1981

జి. వి. సుబ్రహ్మణ్యం

శ్రీ పరబ్రహ్మణే నమః

# కురంగ గౌరీ శంకర నాటిక

## ప్రస్తావన

సూత్రధారుఁడు : (ప్రవేశించి)

చ. సగము శరీర మిచ్చి యొకదానను శ్యామల పెద్దపెళ్ళమున్
దగ నలరించి యింక నొకదానిని గంగను జిన్నపెళ్ళమున్
సిగపయి నుంచి సంతసిలఁజేసి సుఖించెడి రాజశేఖరుం
డగు ప్రమథాధినాథుఁడు సమస్తశుభంబుల మీకు నిచ్చుతన్.

నటుఁడు : (ప్రవేశించి) బావగారు! ఏమి యీ మహాజనసభ యెంత దర్శనీయముగా నున్నది? ఆహా!

సీ. వేదార్థ షడ్దర్శనాదివేదులు మహామతులు
పండితులు బ్రాహ్మణులు గలరు
వితరణశాలులు వీర్యగాంభీర్య కీర్తి
విధానులైన క్షత్రియులు గలరు
కోటికిఁ బడగెత్తికొన నమ్మ ఘనులైన
మంచిపేరుగల కోమటులు గలరు
పాడిపంటలయందు ప్రబలులై ద్విజసేవఁ
దనరారు నట్టి పాదజులు గలరు

గీ. యింక నేద్వర్ధురాజన్య నేలుబడిని
పెద్దపెద్ద కితాబుల బెనసి మొనసి
వన్నెవాసులు గల గొప్పవారు గలరు
యీ సభాస్థలి వర్ణింప నెవరివశము ?

బావగారు! ఈ సభను వర్ణించుటకు నేను సమర్థుఁడను కాను. కాని, యీ రాత్రి యీ సభ కూడుటకు నిమిత్తమేమో తెలియక యున్నది. సెలవిండు.

సూత్ర : (నవ్వుచు) హా! ఏమి యిది, మా బాగుగా నున్నది. ఉత్తరదేశపు భరతులవలె గంజాయిని యలవాటు జేసితివా? లేక యిప్పుడే నిద్రనుండి లేచితివా? ఈ భరత ఖండములో రవలు చెక్కిన బంగారపు అందె దొడిగిన భరతుఁడవు నీ వొక్కఁడవుగాఁ దోఁచుచున్నావు. ఆనాఁడు భరతుఁడు పరిపాలన చేయఁబట్టి యీ దేశమునకు భరతఖండ మని పేరు వచ్చినది. ఈనాఁడు నీ వొక భరతుఁడ వున్నావు గనుక నా పేరు చెడక నిల్చినది.

నటుఁడు : (నవ్వి) అట్లైనచోఁ గవిత్వమున నింకను వర్ణన సేయఁగలవు. ఆనాటి భరతునకును నాకును నెంత తారతమ్యమున్నది? అధికోపమ గదా! అంతయుఁ బెద్దలైన మీ యాశీర్వచనమే కదా; కాని నే నడిగినది సెల వియ్యరైతి రేమి ?

సూత్ర : ఏమిటోయి యిది! నీ దేహమే నీకు తెలియకున్నట్లున్నది! సరే — నా చేయి గోకుచున్నావేమోయి! (అని నటుని చేయి తన చేతితోఁ దీసివేయును.)

నటుఁడు : నేను గోకుచున్నది నా చెయ్యికాదా భావగారూ !

సూత్ర : నా చేయి గోకుచున్నావోయి. మంట యెత్తుచున్నదోయి.

నటుఁడు : పొరపాటు వచ్చినది. క్షమించి యీ సభా వృత్తాంతమును సెలవిండు

సూత్ర : ఈ భరతఖండములో మద్రాసు రాజధానిక్రింది గంజాం మండలమునందు శ్రీకాకుల మను పురము గల దెఱుఁగుదువా?

నటుఁడు : బాగుగానే యున్నది. శ్రీకాకులమునే యెరుగనా ?

సీ. సకలసౌభాగ్య ప్రసక్తి ప్రశస్తి నా
నాకులంబైన శ్రీకాకులంబు
చంద్రశాలా మహాసౌధ సంవాసి
లక్ష్మీకులంబైన శ్రీకాకులంబు
నీతిప్రచార మానిత సాధుసంఘని
ర్వ్యాకులంబైన శ్రీకాకులంబు
ఆరామ సంచారి కీర పారావత
కోకిలంబైన శ్రీకాకులంబు

గీ. వనగత సుగంధ చాంపేయ వాకులంబు
మహితకాసార వికచ ద్రుమాకులంబు
నయవిహీనఖరోరగ నాకులంబు
లోకవిఖ్యాతమైన శ్రీకాకులంబు.

సూత్ర : దాని శాఖానగరంబగు నరిసవల్లి నెఱుంగుదువా ?

నటుఁడు : బాగుగా నెరుఁగుదు.

సీ. మణికాంచనాది సంపత్సమన్వితయైన
సిరిపాల వెల్లి యీ నరిసవల్లి
శ్రీవల్లభపదాబ్జ సేవానురక్తయౌ
సురకల్పవల్లి యీ నరిసవల్లి
సూర్యనారాయణస్తుతిపాతక క్షమా
సురవాఙ్మతల్లి యీ నరిసవల్లి
... ... ... ... ... ... ...

గీ. సరస సుమవాటికాగత చారుమల్లి
పుణ్యపురుషాపదాతపంబునకు వెల్లి
కలుషమూషికములకును గండు బిల్లి
ధరణిఁ గీర్తివహించు నయ్యరిసవల్లి.

సూత్ర : ఆ యరిసవల్లి కధిష్ఠాతయగువాఁడు సూర్యనారాయణ దేవుఁ
డని యెఱుంగుదువా ?

నటుఁడు : ఓహో ! ఎఱుంగనామఱి ! — బావగారు, మీరు సంస్కృ
తము చదువుకున్నారా ?

సూత్ర : చదువుకున్నానుగాని త్వరగా చెప్పుము.

నటుఁడు : నెమ్మదిగా — చక్కఁగా — నిలచి వినుండు బావగారు !
ఇదిగో శ్లోకరూపమున జదివెదను.

"యస్మిన్నాన్తే జగదిద మహో య స్సమస్తేపి రేజే
యస్యాగే భూః ఫణిగణభుజ స్సారథిః స్సారథీశ్చ,
యం లక్ష్మీశ శ్శతధృతి రమావల్లభ స్సంశ్రయంతే
స ఛ్ఛాయేశ శ్శమనజనకః పాతు చార్వార్షవల్లీ"

సూత్ర : ఆ సూర్యనారాయణమూర్తికిం గృతియిచ్చి రచియింపఁబడిన
"కురంగ గౌరీ శంకర నాటిక" నెఱుంగుదువా ?

నటుఁడు : రచించిన కవి యెవ్వరయ్యా !

సూత్ర : కృష్ణా గోదావరి మండలములయందు మొదటితరగతి ప్లీడరు గానుండు దాసు శ్రీరాములుగారిని యెఱుఁగుదువా?

నటుఁడు : ఓహో ! వారినే యెఱుఁగనా? వారు రచించిన యనేక నాటకములను ఆడి పాడి అభినయించి యున్నాఁడను.

మ. పదిరెండేడులయీడునం గవితఁ జెప్పంబూని వ్యస్తాక్షరీ
విదళిఖ్యాతిఁ బొసంగి లేఖకతతవ్రీడాకరంబైన మే
రఁ దుదిన్ బద్యములల్లి సద్గణిత హోరాశాస్త్రసామర్థ్యముల్
వెదజల్లం దగు దాసు రామకవిశాలీలాబ్ధి నోలాడితిన్.

సూత్ర: వారు రచియించిన కురంగ గౌరీ శంకర నాటిక నభినయించుటకు సభికు లనేకరీతుల మన కాజ్ఞ నిచ్చుచున్నారు. కావున నొక రమ్యమైన పాటఁ బాడి యీ సభవారిని రంజింపవలయునోయి !

నటుఁడు : బాగుబాగు. మిక్కిలి సంతోషము. (ఇటు నటు పరిహాసముగా తిరుగుచు నాకాశమువంకఁ జూచి, చూచి, నిలచి) బావగారూ ! పురుషకంఠము సభ నేమి రంజింప జేయును? అయినను నా కంఠధ్వనిని గొంచెము పరీక్షింపుడు. (అని అవలయ, అపస్వరము వినవచ్చునట్లు రాగము పాడఁబోయి, దగ్గి దగ్గి) కొంచెము జలుబుగానున్నది బావగారు ! కానివ్వండి. సమయము వచ్చినపుడు పని జరిగించ కున్న బాగుగా నుండదు. (అని మరల కొంచెము దగ్గి, నోటిలో లవంగము వేసుకొని, ఒకపాట మొదలుపెట్టి, మరల దగ్గుచున్నాడు.)

సూత్ర : చక్కఁగా నున్నదోయి నీపాట! నలుగురు నవ్వు నట్లు చేసితివి. ఇఁకఁ జాలించు.

నటుడు : నలుగురు నవ్వునట్లు చేయుటకే కదా మన భరత విద్య యేర్పడినది. నవ్వక యుండునట్లు చేయమనుచున్నావా ఏమి? అటులైన నొక దుడ్డుగఱ్ఱ యున్నదా యిచ్చట?

సూత్ర : ఏమి? — కొట్టఁదలంచితివా?

నటుఁడు : మరియొక మార్గ మేమున్నది?

సూత్ర : ఇంకను, ఈ పరిహాసకము చాలించి సభను రంజింపఁ జేయుము.

నటుడు : అటులైన మా యింటిదానిం బిలచి పాటఁ బాడించెదను. (తెరవంకఁ జూచి) ఓసీ! గృహిణీ! ఇటు రమ్ము.

నటి : (ప్రవేశించి) స్వామీ! జోహారులు. ఏల నన్నుఁ బిల్చితిరి? మీ యాజ్ఞకు బద్ధురాలను; సెలవిండు.

నటుడు : నీ వెప్పుడు అష్టాగే నా యాజ్ఞకు బద్ధురాలవే. నే నెఱుఁగనా యేమిటి?— ఇదిగో! ఈ సభవారు, యీరాత్రి కురంగ గౌరీ శంకర నాటిక నభినయించుట కాజ్ఞాపించిరి. కావున నీ సభను రంజింపఁజేయుట కొక పాటను మును ముందు పాడవలసి యున్నది.

నటి : అటులైన సభారంజనార్థము పాటఁబాడుట తప్పునా? ఎటువంటి పాటయో సెలవిండు.

నటుడు : ఋతువర్ణనము.

నటి: ఏ ఋతువు స్వామి!

నటుడు: ఈ వసంత ఋతువునే వర్ణింపుము.

నటి: ఏ రాగములో నుండవలయునో!

నటుడు: వసంతరాగములోనే.

నటి: అలాగే స్వామీ!

పాట: వసంతరాగము — అటతాళము.

ఎంతో హాయీ — యెంతో హాయీ
వింతయౌ వ — సంతకాలా ॥ మెంతో హాయీ ॥
విరహిణులా — మానములా—హరణమొనరించు మంచి
కిరణములూ గలిగి యలా — కామదేవుం డెదమెచ్చ ॥ నెంతో ॥
తుమ్మెదాలూ — ఝుమ్మనుచూ — క్రొమ్మావుల కొమ్మలనూ
కమ్మపూవూ దేనియలా — జిమ్మలకింపుగా గ్రోలూ
॥నెంతో హాయీ॥ 2

కులుకుచునూ గోయిలలూ — కూకూయని కూయఁగనూ
యెలప్రాయపూ చెలువలూ — జలకేళిలూ సలుపఁగనూ
॥యెంతో హాయి॥ 3

(తెరలో గారి)

అదిగో, అదిగో పాపము! ఆ చిన్న లేఁడిపిల్ల బెదరి బెదరి వచ్చుచున్నది గదా!

నటి: స్వామీ! లేఁడిపిల్ల యను శబ్దము వినంబడుచున్నది. నాకు చాలా భయమగుచున్నది. మన మిచట నుండరాదు.

నటుడు: ఓసీ! నాకు సంశయముగానే వుంది. పోదము పద పద.

(నిష్క్రమింతురు)

# కురంగ గౌరీ శంకర నాటిక

## ప్రథమాంకము

[బదరికారణ్యమునందలి పర్ణశాలయొద్ద తపస్వినీవేషధారిణి యగు గౌరియు, ఆమె చెలికత్తె లగు బాలయు, సుందరియుఁ బ్రవేశించు చున్నారు.]

గౌరి : ఏమే బాలా ! చూచితివా సుందరీ ?

సీ. మెడఁద్రిప్పి వెనువెన్క మిట్టి చూచుచు నక్క
చంగున మైసాచి సరగముడుచు
చెవులు నిక్కఁగ ముట్టె చెమటట్టఁగ మీఁదఁది
కెగసి యం దందఁ గాలిచ్చి నిలచు
నులి వాలకించి దిక్కులు సూచి పలుమాఱు
భ్రమయుఁ బ్రక్కలఁ బాఱు నెమరుఁగ్రక్కు
దొట్రుపాటునఁ దూలి దోఁకమడంచి యా
యాసాన దీర్ఘనిశ్వాసమిచ్చు

గీ. దవ్వు దవ్వుల మనశాలదారివట్టి
బిరబిరన వచ్చుచున్నదీ వేళఁ దనకు
నేమి తొందర కలిగెనో యెఱుఁగనమ్మ
చెలియలార ! కనుండి యీ చిన్ని లేఁడి.

చెలియలార ! ఆ చక్కని లేఁడిపిల్లం దెచ్చి నా కిచ్చి మీరు మఱియొక పని చూచుకొండు.

బాల : అమ్మా ! మీయాజ్ఞకు వ్యతిరేకము జరుగునా ?

సుందరి : తల్లీ ! ఏ కట్టిడి యెంత పట్టు పట్టినను ఆ చిట్టిపొట్టి లేఁడిని పట్టి తెచ్చి నీకర్పితముజేయుటం బెట్టమా ?

(అని యిరువురు వెళ్ళుదురు)

గౌరి : (తనలో) అహా ! ఆకలంబులైనఁ దినక యేకతంబున వనవాసంబు సేయుచు నదీజలంబు పానంబుసేయుచు, వాయు భక్షణంబు జీవనాధారంబుగాఁ గఠినియమంబుల పాలై యా సదాశివుని సాంగత్యంబు నపేక్షించి దీర్ఘ కాలంబు తపంబు నడిపితి. నేఁటికైనను బరమేశ్వరునకు దయ కలుగదాయెఁగదా. అయ్యో ! ఎంతకాల మీ విధముగా నుండవలయునో! తదాయత్తం బగు చిత్తంబుతో నిట్లుత్తలపడుచున్న నాయం దా మహాదేవున కింతవఱకును లేశమైనఁ గటాక్షము కలుగదాయె. నా పూర్వ పుణ్య మెటుల నున్నదో ! ఎట్లులైన నే నా యిందుమౌళి పొందుఁ గోరినదాననే కదా ! — ఓసీ చిత్తమా ! తత్తరపడెదవేల ! తొందరపడినంత మాత్రమునఁ గార్యములు పొసంగునా ? ఓర్పు లేకయే కదా నా పూర్వజన్మంబున దక్షునింట దగ్ధురాలనైతిని. అప్పు డట్లు సేయకున్న నిప్పుడు నా కీ పాటు లేల కలుగును ? "బుద్ధిః కర్మానుసారిణీ" అను నార్యోక్తి వేఱగునా ? (చేతులు మోడ్చి నిమీలితనయనయై) పరమేశ్వరా ! మహాదేవా ! దయ రాదా ?

(అనుచుఁ బర్ణశాలకుఁ బోవును.)

(లేఁడిని వెంబడించుచుఁ గిరాతుఁడు ప్రవేశించును.)

కిరా: పోకు పోకు నీదెబ్బగాలా, యిదిగో నీగుండెలు కందలు దీస్తా చూస్కో. ఒక్కకోల దిట్టంగా లాగి యేస్కుంటే కుసుక్కున గూలబడ్తావు. యేమో అని సూస్తావుంటే నీపని మాగాదుగా వుండాదిలే. దెహబ్బా! యెక్కడ బోతావోశీ! నిల్పదు. నిల్పదు. ఈ పొదకట్టులో దబ్బా దట్రా, ఆకూ అలం తిని పోతరించావులే. నీదావు దగ్గెరబడ్డాది. యాస్తుండా, యాస్తుండా. యీకోల్తో కూల్తావులే. (అని తన సింగాణియం దమ్ము తొడుగుచున్నాఁడు.)

బాల: (ప్రవేశించి)

ఉ. అద్దిర పాడుముండకొడకా కడుపాకటిమంటఁ దీర్చికో
ముద్దుల లేఁడిపిల్ల నిటు ముట్టి దయారస మావగింజలో
బద్దయు లేక గ్రూరశర బాధల కగ్గముసేయఁబూని మా
హృద్దళనంబు సేసితివి హేయము నీ బ్రతు కేల? ఛీ! ఖలా!

సుందరి: (ప్రవేశించి)

శా. ఓరీ! ఘోరకిరాత! నీ సహజదుష్టోద్యోగ మిం దేల నీ
ప్రారంభంబులు కూడవిత్తతిని మాప్రాలేయ భూభృత్కుమా
రీరత్నం బభయంబొసంగె నిఁక నిఁకన్నాని నీక్రోవనే
పోరా తక్కిన మచ్చిలీముఖశిఖాపుంజంబు నిన్మట్టెడిన్!

కిరా: ఓలి మీ ముండా మొయిహ్యా — యాళ్ళె మీరు? ఏం మా బెదిరిత్తుండారు!

నాదనామక్రియ — ఆట

వోలబ్బా వోలబ్బా యారె ఇచట
గోలజేయఁగ వచ్చినారె పోరే ॥వోలబ్బా॥

తాలే తాలే నాకు దరమాలు సెప్పేరు
మాలావు దొరసాన్లు పాలుబడ్డారు ॥ఓలబ్బా॥

మల్లి మాటాడితే మక్కెల్బగలబొడ్తూ
కోళ్ళన గూలఁగ బుఱ్ఱ ల్బగలవేతు ॥ఓలబ్బా॥

సమ్మతి మెకములఁ జంపి బ్రతుకుమని
బమ్మదేవుఁడు మాకు వ్రాసిపెట్టాడు ॥ఓలబ్బా॥

బాల : ఓరీ ! నీచా ! బ్రహ్మదేవుఁడు దయారసమును మాత్రము సృజించలేదనుకున్నావా ?

శ్లో॥ "విద్యా సా విపులా మతి స్త్రిభువనప్రఖ్యాతవిఖ్యాత సా
కాంతి స్సా కమనీయతా చతురతా కల్యాణలక్ష్మీశ్చ సా
శక్తి స్సా సమతాపి సాచ సదసత్తత్త్వైకబోధాఽపి సా
నీతి స్సానియతిశ్చ సాహృదిగతాన్యాణా మదోషాద యూ."

ఉ. తూలఁగనాడె దేర ? నిజదుష్కృతి కింతయు నీ మనంబులో
జాలి వహింపవేర ? మృగశాబక మొక్కటి భీతిఁబాఱఁగాఁ
గోలనుగొట్టి చంపి తినకున్ననుఁ జత్తువా బ్రహ్మదేవుఁ డు
ద్వేలదయారసం బొకటిఁ బెట్టినజాడ గ్రహింపనేరవో ?

(అని యుటికి లేఁడిపిల్లం బట్టుకొనుచు.)

సుందరి : (బోయవాని కెదుట నిలచి)

ఉ. నీతి గ్రహింపవైతి విఁక నీగతి యెట్లగునో మదీయ ఘో
రాతతశస్త్రపాతముల నగ్నిశిఖల్ వెలుగంగ నందులో
నీతల కాలదే; కదలు మిత్తిని బట్టఁదలంచితేని లే
దా తెరవేదొ చూచుకొనుమా నిజజీవితరక్షణార్థివై.

కిరా : (ముఁదుకు నడచి) తాలుండో స్తాలుండోసి ! యీ యింటి బిడ్డెట్టి మూడుపోట్లు మొదిస్తినా బుర్రలు పగుల్తాయి. లేఁడిపిల్లను మట్టుకొని నిల్చిద్దారుగా ! అవున్గాని, యేంటే లేఁడిపిల్లను వదుల్తారా లేదా మీరు ? ఆడోఁడ్లు కూడా గందా. ఒక యేతేతునాసూడు. ముక్కు మన్ను గాకుండా యీడుస్తాను సూడు. వదుల్తారా లేదా? మీ అబ్బసిగ దరగా. నవ్వుతా ఉండారూ! నాదెబ్బ సూసోఁకుండి.

(అని వింటిబద్ద పై కెత్తి కొట్టబోవుచుండఁగా)

సుందరి : ఇదిగో ! తిరస్కరిణి నుపయోగించుచున్నాను.

(బాలయు, సుందరియు లేడిపిల్లయు నదృశ్యు లగుదురు.)

కిరా : (ఆశ్చర్యపడి, తనలో) ఓరి బాబో ! ఏందిరాయిది ! విసిత్తిరమై పోయిందిగందా ! నాలేడి పిల్లేద పోయింది? ఆడో శ్శేదబోయారు! కనుకట్టుసేసి పొయ్యారుగందా. దీనికేంగాని నోటికాడికూడు సిద్దాన్నం సిద్దాన్నంతాఁళ్ళాకుక్క పొయ్యారుగందా. కళ్ళకగ్గనబడితే యీళ్ళలోగాలుకుదుర్తుగఁదా (నలుదిక్కులు చూచి) యేదనైనా

దాక్కొఁదారేమోగందా. అడుగుల జాడలుకూడా గన్పడదంలేదే! ఇదేమో యిట్టి మాయగా వుఁదది.

(అని చింతాక్రాంతుఁడై వెళ్ళిపోవును.)

[బాలాసుందరులు రాక కెదురుచూచుచు గౌరి ప్రవేశించును.]

గౌరి : (తనలో) అదిగో, లేఁడిపిల్లను బట్టుకొని బాలా సుందరులు వచ్చుచున్నారు! ఇపు డేమో నా యెదమ కన్నదరుచున్నది.

క. అది యేమో వామాంబక
మదరంగాఁజొచ్చె శుభసమావేశము నా
కొదవించు దైవయోగము
తుది నెట్లో శివునికరుణ దొరకెడి నొక్కో!

సుందరి : (లేఁడిపిల్లతో వచ్చి) అమ్మా! కిరాతుండు వెంబడించి తరుమ శ్రమభరంబున దుమికి వచ్చుచున్న మృగ శాబకంబును గిరాత ప్రతిబంధంబునుండి తొలఁగించి పట్టితెచ్చి నీ కట్టెదుట నిల్పితిమి.

గౌరి : మంచిపని జేసితిరమ్మా.

బాల : (వచ్చి),

గీ. రమ్యవస్తువు ప్రతిబంధ రహితమగుచుఁ
గరగతంబౌట శుభసూచకంబు సుమ్ము
మృగకిశోరంబు దొరకుట మేలు నమ్ము
నిక్కవంబుగ ముక్కంటి నీకు దక్కు.

గౌరి : అయ్యో! అంత భాగ్యమా! అట్లు దీర్ఘసమాధి నెక్క డనో యున్న శంకరుఁడు మేలుకొనుట యెట్లు? అతఁడు నాకు

దక్కుట యెట్లు? దైవవశ మెలాగున నున్నదో అట్లు కానిండు. కల్యాణ లక్ష్మీవ్రతము పూనుకొని యుంటిమి. పనులు జరుపు కొనవలయును. త్వరగా పర్ణశాలను ప్రవేశింతము రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

# కురంగ గౌరీ శంకర నాటిక

## ద్వి తీ యా ం క ము

[అమరావతి, సుధర్మ సింహాసనము, (రాజు) దేవేంద్రుఁడు, (మంత్రి) బృహస్పతి, (దిక్పతులు) అగ్ని, యమ, నిరృతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు ప్రవేశించి]

దేవేంద్రుడు : (అగ్నింజూచి) ఓయి కీలీ! నీ మూల మేలా?

అగ్ని : శచీనాధా! ఏమి చెప్పుదు. తారకాసుర మహారాజుగారి వంట యింటి గాడిప్రోయి నాశ్రయించి బ్రతుకుచున్నాను. నర మాంసముల కంపు గిట్టక నానాబాధలు పడుచున్నాను. నా మూం యొకటి నేను చూచుచున్నానా స్వామీ!

దేవేంద్రుడు : (యమునింజూచి) ఓయి శమనా! నీ దిక్కు చక్కగా నున్నదా?

యమ : అమరేంద్రా! తారకాసుర మహారాజుగారు చిత్రగుప్తుని స్వాధీనములోనున్న లెక్క దస్త్రాలు చింపివేయించినారు. నా పని యేమిటో నాకు దెలియుచున్నదా? నా వాహనమైన దున్న పోతును దోలించుకొనిపోయి తన పూవులతోటలో దుక్కి దున్ను కొనుచున్నాఁ డు. ఇప్పు డేలినవారి దర్శనమునకు కాల్నడకనే

వచ్చినాను. ఇదిగాక నా సవతితల్లి కొడుకు శనైశ్చరుఁడు నన్ను పూర్ణకటాక్షముతోఁ జూచుచున్నాఁడు. ఇప్పుడి రాక్షసుడు కిట్టిలు పెట్టినందున ద్వాదశమందు ప్రవేశించినాఁడు. ఏడేండ్లన్నుఱ దాఁటిన తర్వాత యెట్లుండునో? — నా దిక్కేమిటో నేను చూచుచున్నానా స్వామీ।

దేవేంద్రుడు: (నిర్‌ృతింజూచి) ఓయి కోణపా! నీ కోణంబునఁ గల్యాణమా?

నిర్‌ృతి: సురోత్తమా। తారకాసుర మహారాజు నీకును మాకును యెక్కడనో జ్ఞాతిసంబంధ మేర్పడినదఁట. — ఈ మధ్యనే నా మీఁదికి దండెత్తివచ్చి నా కోరలకు మ్రోకులు వోసి చెట్టు కొమ్మకు వేలాడఁగట్టించినాఁడు. (నెమ్మదిగా) చెప్పుకొనుటకు సిగ్గు — జనానాలో చేసిన గల్లంతు యింతింతా? ఆ నావర్దా పడలేక నేను వాకిట కావలి నౌకరీ కొప్పుకున్నాను. అంతటితో సరిపోయినదీ మా జనానా — ఖాన్ జనానా (యేడ్పుతో) దుఃఖ మవుచున్నది. వాని గృహసమ్మార్జనము చేయు దాసిగా నుండు టకు గూడ సమ్మతించవలసి వచ్చినది. నా కోణమేమిటో నేను చూచుకొనుచున్నానా స్వామీ।

దేవేంద్రుడు: (వరుణునిం జూచి) ఓయి వరుణా! నీ హరిత్తు సుఖ వత్తా?

వరుణుఁడు: హరిహరీ! నాసు తెల్లవాఱ లేచినాను. ఇప్పటివఱకును తారకాసుర మహారాజుగారి యింట నీళ్ళకావడి వేసికొని మ్రోచి మ్రోచి బుజాలు పుండ్లు పడినవి. నీళ్ళు తోడితెచ్చుటకు, త్రాళ్ళు

కావలయుననీ యడిగితిని. కోపగించి 'చెంబటి ముండకొడుకా ! నీ పాశము లేమైపోయినవ''ని కొట్టవచ్చునరి కాకాశమున కెగసి యెగసి, బహు దూరముపోయి, అలసి, నా వాహనమైన యొక మకరమును, నా నెత్తిమీఁది కుంభమును అచ్చట వదలితిని. అవి రెండును శనైశ్చరుని స్వాధీనములో నిప్పు డున్నవి. మీరు విదారించవచ్చును. తర్వాత నా త్రాడే పెట్టి నీళ్ళు దోద నారం భించితిగాని త్రాడు తెగినది. మూడు ముళ్ళు వేసినాను. చూడు ? నా హరిత్తు నేను చూచుచున్నానా స్వామీ !

దేవేంద్రుడు : (వాయువుంజూచి) ఓయి వాయుదేవుఁడా ! నీ వైపు కాపుదలగా నున్నదా ?

వాయువు : పురందరా ! ఇప్పటి నా నీచదశ నేనేమి చెప్పుదు ? తారకా సురమహారాజుగారి పంకాలాగు పనిలో బడి యున్నాను. దాని కేమి? పుల్లాకు లెత్తి విసరలేని నా బాధ చెప్పకొనదరమా ? అగ్ని వంట వాఁడుగా నున్నందున మా కిటువరకుఁ గొంచెము సాంగత్యము కలిపినాఁడు. అందువలన నాకుఁ గొంచె మాహారము దొరుకు చున్నది. నావైపు నేను చూచుకొనుచున్నానా స్వామీ !

దేవేంద్రుడు : (కుబేరుంజూచి) ఓయి కిన్నరాధీశా ! నీ దిశయొక్క దశ బాగుగానున్నదా ?

కుబేరుడు : బలసూదనా ! నా పని దివాలాఅయినజాద తమకు విశదపడ లేదు కాఁబోలును. నా నవనిధులను తారకాసుర మహారాజుగారు

త్రవ్వించుకొని పోయినాఁడుగా. ఇంకేమున్నది.? నా స్నేహితుఁడు పెద్ద జంగమయ్యగారి జోలె యక్కడకు వచ్చినదిగా. పెద్ద జంగమయ్యగారు తపస్సునకుఁబోవుచు మా యింటి చిలువకొయ్యను దగిలించి పోయినాడుగా. అదే వాడుకుంటున్నాను. సాంబయ్య లింగము సమాధి విడిచివచ్చెనా, అదియును లేదుగా. కొడుకు నల కూబరుఁడుగాఁడు కుదిరికూర్చుండఁడుగా. ముండలముట్టాకోరు. జక్కులముండాకొడు కాయింటో వెచ్చాలకొట్టుమీద కూర్చుండి నౌకరీ చేయు మనగా ప్రొద్దువాడిచినది మొదలు ప్రొద్దుగ్రుంకు వఱకు అక్కడనే. ఊఁ. ఏమున్నది ?— నాదిశ యెట్లున్నదో నాకేమి తెలియును స్వామీ!

దేవేంద్రుడు : (ఈశానునిం జూచి) గిరీశా ! మీ విదిశ సుదశముగా మున్నదా ?

ఈశా : మహేంద్రా ! తారకాసురుఁడు యెట్లనో మాయచేసి నా వాహన మైన యెద్దును, యెర వడగి తోలుకొనిపోయి, ధ్రాంగముండ కొడుకు చెఱకుగానుఁగకు గట్టి పని చేయించుకొనుచున్నాఁడు. నా శిశలన్నియు సమాధిలో యున్నవి. కళాలేశముమాత్రమే యిచ్చట నున్నది. ముం దెట్లుగా నుండెనో. ఈ కొంచెము కళతోనైన నెదిరింతమా ? అని యూహించితిని. వాఁ డఖండ శివపూజా ధురంధరుఁడు. వానింజంపఁ జేతులురావు. నాదిశ యొక మోస్తరుగా నున్నది. దస్తువసూలు తక్కువ. సేనలను తగ్గించి నాను. బూజాధికి జరుగుచున్నది.

దేవేంద్రుడు : ఏమి? ఈ యసురాధముని నిరంకుశ ప్రతాపము! ఈ మధ్యను మన స్వర్గముమీఁదకుఁగూడ వచ్చి దేవతలకు మిగులఁ బీడ కలుగఁజేసినాఁడు. వరసంపత్తిచేఁ గదా వీని కిట్టి ప్రభావము లుత్పన్నములైనవి. వానికిఁ గాలము బాగుగా నున్నది. దుర్మార్గుల కిట్టి మహామహిమలు సంప్రాప్తింపఁ జేయు శ్రీ పరమేశ్వరుని క్రియాపైచిత్రియే. ఆ దుర్మార్గుఁడు స్వర్గలోకము నంతను బరిపాలింపదలంచిన ట్లున్నాఁడు. వాని దుష్కృత్యము లెన్నియని గణింప శక్యమా?

చ. నరులవధించుఁ, గామినుల న్యాయముదప్పి గ్రహించు, యక్ష కి
న్నర గరు డోరగ ప్రముఖ నాకనివాసుల దొడ్డిబెట్టు, న
చ్చరలను బట్టు, గోవులను జంపును, యజ్ఞవిధాన వేదులన్
జెఱచును తారకాసురుఁడు చేయనిదుష్కృతి యొక్కటున్న దే?

(బృహస్పతిం జూచి) ఆచార్యవర్యా! మేమందఱము సదా మీ యుపదేశంబుననఁగదా వర్ధిల్లుచుంటిమి. ఆ దుర్మార్గుడైన తారకాసురుని వధించు మార్గ మొకటి యాలోచించరు గదా!

ఆ. వె. బాగు సేయరాదు శత్రుప్రతాపంబు
వేగిరంబ యణఁచి వేయవలయు
కాలఁ గ్రుచ్చుకొన్న కంటకంబును బోలె
ననుచు బుద్ధిమంతులాడ వింటి.

బృహస్పతి : దేవరాజా! శివపార్వతులకు జన్మించు కుమారస్వామి తప్ప, తారకాసురుని జయించువాఁ డింకొకఁడు లేఁడు.

దేవేంద్రుడు : అటులైన పర శివుం డిపుడు సమాధిలో నుండెనే ! పార్వతీదేవి యరణ్యమునం దపోవృత్తి నుండెనే ? వీరిరువురకు సాంగత్యంబు గలుగుట యెట్లు ?

బృహస్పతి : శివపార్వతులకు సంయోగ సంఘటనంబు సేయు తలంపుతో నిదివఱకే నారాయణుండును, బ్రహ్మయు నాలోచించుచునే యున్నారు. నీవు నా ప్రయత్నమే చేయుము. ఆ మిథునంబునకు సమాగమంబు కలుగును; కుమారుఁ డుదయించును. దుష్టుఁడైన తారకాసురుఁడును హతుఁడగును. లోకమును బాగుపడును.

దేవేంద్రుడు : స్వామీ ! నేఁ జేయు నుపాయం బొక్కటి యున్నది. అది యేది యనిన హరికుమారుండగు మన్మథునిం బ్రేరేపించి శ్రీ సదాశివుని సమాధి యుడుఁగునట్లుచేసి గౌరి యందుఁ బరమేశ్వరునిచిత్తంబు హత్తింపఁజేసితినా కార్య సానుకూల మగునని తలంచెద.

బృహస్పతి : ఇంద్రా ! అట్లనే కానిమ్ము. కొన్ని యశుభంబు లందందపొడసూపెదిని. కాని, భయము లేదు. తుద కన్నియుం జక్కఁగనే పర్యవసించును.

దేవేంద్రుడు : (సింహాసనము దిగ్గి, నిలచి, చేతులు మోడ్చి నిమీలిత నయనుడై)

చం. మదమతి బ్రహ్మ విష్ణు పురమర్దను లెవ్వని యిక్షుచాప ష
ట్పదగుణ పుష్పబాణముల బారికి మాఱొనరింపలేక ని
ష్ఠఁ దొలఁగి యంగనాజన కటాక్షములం జరియింతు రట్టి జ
ల్లిదుఁడగు కామదేవుఁ డధిలీలుఁడు నాకుఁబ్రసన్ను డయ్యెడిన్.

కాముడు: (చిలుక వాహనముతో, రతీదేవితోఁ బ్రవేశించి) ఇంద్రా! నేనే కామదేవుండను. అతిభక్తితో నీవు నన్ను బ్రార్థించినతోడనే ప్రసన్నుండ నైతిని. నన్ను దలంచిన పనియేమో చెప్పుము. తప్పక నీ కార్యము తుద ముట్టించి నిన్నుం గాపాడెదను.

దేవేంద్రుడు: మన్మథా! రతీప్రాణనాధా! నిఖిల జంతునిర్మాణ నిపుణా! పంచబాణా! నీ మహిమంబు గొనియాడ నే నెంత వాఁడ. నీ వాదినారాయణుని ముద్దుబిడ్డఁడవు. అఖిలలోకంబుల మోహింపఁజేయు చతురుండవు. నీవలనంగాని కార్యం బొకటి కలదా? నీ యమోఘ పుష్పబాణంబున కపజయంబన్న విన్నది కాదు. ఇప్పుడు నావిన్నపం బొకటి కలదు. మందరనగశిఖరంబున మయూరారణ్యంబున దీక్ష సమాధినున్న మహాదేవుని చిత్తంబు మెత్తంజేసి, పార్వతిం గామించునట్లు సేయవలయు.

కాముడు:—

చ. తెలిపెద నింద్రుఁడా! విను మదెంతటి దుస్తరమైననేమి? శ్రీ
గళుఁడుమహోగ్రుఁడాతని ముఖంబున నిల్వఁదరంబెయంచు నేఁ
దలఁప క్షణంబులో నతనిఁ దార్చెద. బర్వతపుత్రి చెంగటం
గలదె? పరోపకారమున కన్నను బుణ్యము విష్టపత్రయిన్.

దేవేంద్రుడు: చిత్తము మహానుభావా!

కాముడు: ఇంద్రా! నే నిఁకఁ బోయెద. (నిష్క్రమించును)

దేవేంద్రుడు: (సభికులతో) ఆహా! ఎంత సంతోషమైనది. మన్మథ మహాదేవుండు మన కిచ్చిన వరము వింటిరిగదా.

(అందఱు నిష్క్రమింతురు.)

## రెండవ రంగము

[మందరనగమున మయూరారణ్యములో వటవృక్షము క్రింద వీరాసనస్థుఁడై సమాధిలోనున్న శివుఁడును, ఆయన యెదుట నిజ పుష్ప బాణాదులతో మన్మథుఁడును, వెంట వసంతుఁడును ప్రవేశించుచున్నారు.]

వసంతుడు : మన్మథ మహారాజా! నాపని నేను చేసికొంటిని. ఇదిగో, యీ కమ్మతావు లుప్పతిల్లు క్రొమ్మావులం జూడు. ఝుమ్మ ఝుమ్మని చెలరేఁగు తుమ్మెదలం జూడు. కూ కూ యను కోయిల లను జూడు. ఈ యెట్టని జిగురు జొంపములను జూడుము. అన్నియును రమ్యంబులై కాముక మనోవికార కారకములై యల రారుచున్నవి. ఇఁక నీ యుద్యోగంబు కొనసాఁగించుకొనుము.

కాముడు : అట్లుగానే చేయుచున్నాను గాని,

సీ. చిన్నిచందురు రైక వెన్నెలల్పచరింపఁ
జద లాకాసము ముట్టి వెదలగ్రక్క
కంకణీకృతభుజంగమ పూత్కృతులు నింద
సవ్యబాహువు జానుసక్తినదరె
కాలకూటచ్ఛటాక్రాంతి గంతులువార
గళము కుంభక మరుత్కలనఁ బొసఁగె
నవరైన పులితోలు చరమభాగముగప్ప
నొక్కింత చలియింప కొదలు దనరె

గీ. బాహ్యమెఱుఁగక పూర్ణ సమాధినిష్ఠ
నిశ్చలానందమయమైన నిద్రలోన

దన్నుఁ దాఁ జూచుకొనుచున్న ధన్యమూర్తి
నీ మహాదేవు మేల్కొల్ప నెవనివశము ?

వసంతుడు : మీనకేతనా ! నాకును నట్లుగానే తోఁచుచున్నది. గౌరీ కరస్పర్శ యీ మహాదేవునకుఁ గలిగించి యీ సమయంబున నీతనిపైఁ బుంఖానుపుంఖంబులుగా బాణంబులు ప్రయోగించితివేని యీతని చిత్తంబు చలింపఁగలదు. కాని యీ యుత్త యుత్తం పాటువలన నేమి ప్రయోజనము ?

కాముడు : ఇప్పటికి బహుయోజన దూరంబున బదరి కారణ్యంబునఁ దపంబు సేయుచున్న పర్వతరాజపుత్రి వచ్చుట యెట్లు ? ఆమె కరస్పర్శం బీమహాదేవునకుం గలుగుట యెట్లు ?

వసంతుడు : అది యొకలాగున సాధ్య మగునని నాకుం దోఁచు చున్నది. ఎట్లనిన ? ఈమధ్య నందనవనంబునకు వచ్చి యున్న నారదమునివలన నేనొక రహస్యంబు వినియుంటిని. పరశివా న్వేషణ తత్పరయై గౌరి హిమవంతంబునుండి వెడలివచ్చి బదరి కాశ్రమంబునఁ బర్ణశాలలో శివధ్యాన పరాయణయై బాహ్య మెఱుఁగక యున్నపుడు దూర్వాస మహాముని మార్గవశమున నా పర్ణశాలకు వచ్చెనఁట. ఆ సమయమున గౌరి లేచి మర్యాద చేయ లేదని కోపించి, నీవు ధ్యానించువాని స్థానంబు నీకు బాగక్షిణ పోవుఁగాక యని శపించఁగా, నా శాపమును గౌరి యొక్కింతయు నెఱుఁనే యెఱుగదఁట. అంతట హైమవతికిం బరిచర్యలు సేయు చున్న బాలాసుందరుల వలన నతఁ దత్యంత ప్రార్థితుండై, గౌరిచేఁ బెంపబడఁగల లేఁడిపిల్ల శివసమీపంబుఁజేరెనేని శంతరుఁ

డున్నచోటు గౌరికిఁ బొడగట్టునని శాపమోక్ష విధంబుఁ జెప్పెనట. అందుచేతనే మీతండ్రి నారాయణుఁడు లేఁడియై, కిరాతవేషము ధరించిన మీ యన్నయగు బ్రహ్మచేఁ దరుమఁబడి నల్లోక కిటుకుఁ జేసినారు. అదియును తారకాసుర వధాపేక్షచేతనే సుమా! ఇప్పుడా లేఁడిపిల్ల గౌరిచేఁ బెంపఁబడుచున్నది. ఈ విషయము మన దేవేంద్రమహారాజుగారికిఁ దెలియదు. కాఁబట్టి నీ వా లేఁడి పిల్లను మాయోపాయంబున గ్రహించి యీ మహాదేవు వెనుకఁ బెట్టితివా నేనొక యుపాయమున గౌరి నిక్కడకు రావించెద. అప్పుడు మన ప్రయత్నము కొనసాఁగఁగలదు.

కాముడు : ఓహో! వసంతా! మంచి యుపాయము చెప్పితివి కదా! అట్లుగానే చేసెదను.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)

## మూ డ వ ర ం గ ము

[లేఁడిపిల్లకు మేఁతఁబెట్టుచు గౌరియు, బాలయు, సుందరియు, ప్రవేశించుచున్నారు]

గౌరి : చెలులారా! ఈ లేఁడిపిల్లను జూచితిరా. ఇది నా కెంత మచ్చికపడినదో చూడుఁడు. నామాట వినఁగానే నాపై పునకుఁ దేఱఁజూచి బిరబిర పరుగున వచ్చి నన్నడ్డగించి మేఁతఁబెట్టుమని కదల నివ్వదు. మెదలనివ్వదు. ఆకలయిన దినక నాకలి మఱచి

యున్న నేనేమి చేయఁగలనే. ఇది యేదో పూర్వజన్మ ఋణాను బంధము సుమా. దీనిసొమ్ము నేనేమైనఁ దినియుంటినేమో! బాలా! పర్ణశాలలో కొబ్బరాకుల బుంగలో దీనికై చామగింజలుంచినాను. తీసుకొనిరా.

బాల : అట్లే చేయుచున్నాను. (అని పోయివచ్చి) ఇవిగో తెచ్చినాను.

గౌరి : (చామగింజలను లేఁడికి బెట్టుచున్నది.)

(తెరలో)

శ్లో॥ "క్రాంతో వారిణి...చ్యుతికృశోభుక్తిర్న యాతేదినే
బాలః పర్ణ ఫలాదిభక్షణవిధా వభ్యాసశూన్యః ఖలు,
దీర్ఘారణ్యగత స్పహాయిరహితః కో వా మదీయం వచః
శ్రుత్వా పాతుమిహేహా తే కరుణయా జానేన కో మే విధిః"

గౌరి : (చెవి యొగ్గి యాలకించి) ఓసీ బాలా! చూడు సుందరీ! వింటిరా? ఒకానొక యార్తస్వరము వినవచ్చుచున్నది. మార్గక్రాంతుఁడై యా కవిచే బీడింపఁబడిన బ్రాహ్మణ బాలకుఁడుగా నున్నాఁడు. పోయి కొనిరండు.

బాల : అలాగే (అని నడచి తనలో) మన గౌరమ్మ చెప్పిన మాట నిజమే. ఎవ్వరో కుంటి బ్రహ్మచారి వచ్చుచున్నాఁడే! (బ్రహ్మచారి నెదుర్కొని)

హిందుస్తానీకాఫీ — అట — చాపు.

ఎవరయ్యమీరు — బువ్వదినక యున్న
పోలికనున్నా — రెవ్వరయ్యా ॥ఎవ్వ॥

మీతండ్రి పేరేమి — మీతల్లి పేరేమి
మీయూరి పేరే — మెవ్వరయ్యా ॥ఎవ్వ॥
ఈ యరణ్య భూమి — సాయము లేక యే
చనుదేర గతమే — మెవ్వరయ్యా ॥ఎవ్వ॥

బ్రహ్మచారి : అమ్మ నీ వెవ్వతెవో ! నాపాలిటి భాగ్యదేవత వనుకొను చున్నాను. నా స్థితి మీకుఁగాక యెవ్వరికిఁ జెప్పుకొనను ? మా కాపురము వైకుంఠపురము. మా యింటిపేరు పాలవెల్లివారు. మా తండ్రి పేరు నారాయణశర్మ. మాతల్లి పేరు లక్ష్మమ్మ. నాపేరు కామన్న. మేమిద్దర మన్నదమ్ములము. మాఅన్న పేరు బ్రహ్మన్న. నే నొకానొక కారణమున దారితప్పి యేకాకినై యీ యరణ్యమధ్యములోఁ బడి నిన్నటినుండి యన్నములేక నాకటం జిక్కి, కృశించి యున్నాఁడను. పైఁగాఁ గుంటివాఁడను. నాకింత యాతిథ్య మిచ్చి రక్షించుఁడు తల్లులార !

బాల : అటులైన మా పర్ణశాలకుఁ బోదము రావయ్యా.

(అని నడచు చున్నారు)

గౌరి : (బ్రహ్మచారిఁజూచి యెదురుగఁ బోయి యర్ఘ్యపాద్యము లిచ్చి తెచ్చి పీట యిచ్చి) అయ్యా ! మీది మిక్కిలి బాల్యము. మార్గ శ్రాంతులుగా నున్నారు. కాళ్ల బబ్బని కూడఁ దోఁచుచున్నది. ఈ యరణ్యములోనికి వచ్చితిరి. ఇది నిర్మానుష్యము. నేను అకలు, కాదలైనఁ దినక వాయు జలంబు లాహారంబులుగా నున్నాను. మీ యలసట యెట్లు తీరును? కాని వనశాక పదార్థములఁ బూజించెదను. (అని సుందరినిజూచి) సుఁదరీ ! మీ యిరువురకునై చేసుకొని యున్న నివ్వరిబియ్యపు టన్నమును, బలుసుకూర పులుసును, గోరసమును ఈ బ్రహ్మచారి కాతిథ్య మిచ్చిరండు.

(అని అందఱు నిష్క్రమింతురు)

(వసంతుడు చెట్లచాటుననుండి వచ్చును)

వసంతుడు : (తనలో) మన మన్మథుఁడు బ్రహ్మచారి వేషధారియై యీ యాశ్రమములోఁ బ్రవేశించినాఁడు గదా। నేనీ వనమునం గల పాదపంబుల గుసుమ పల్లవ భరితంబులంజేసి శుకపిక శారికాకల కలంబులు గట్టిపరచి, మలయమారుత సహాయుండనై యుండెదం గాక। ఇంతలో శివునిపై నిడిన చిత్తంబుతో, మదన వేదనా దోధూయమాన చేతనయై కాత్యాయని యారాటపడుచుండును. ఎటులైనం గిటుకు చేసి లేఁడిపిల్లను కమ్మ విలుకాఁడు లేవనెత్త గలఁడు. తదుపరి గ్రంథంబు కొంతవఱకు నేను బూర్తి చేసెద.

(అని నిష్క్రమించును)

(తరువాతఁ బార్వతి, బాలాసుందరులు, బ్రహ్మచారి ప్రవేశించుచున్నారు)

గౌరి : శివశివా। పరమేశ్వరా। నిఖిల కల్యాణగుణాకరా! నేనెవ్వరి దానను। నాఁడు నా తండ్రియగు దక్షుని యధ్వరమునకుఁ బోయి వానిచేఁ గల్గిన యవమానంబున కోర్వలేక నిన్నే ధ్యానంబు సేయుచు నెట్టియవస్థ ననుభవించినది నీ వెఱుఁగవా ? అన్యథా వృత్తిలేదను మాట మఱచితివా ? నిన్నుం గూర్చి యింతకాలంబునుండి యిట్లు ఘోరంబైన వైఘానస వ్రతంబునం బడి యీ కారడవులలో యీ పర్ణశాలలో — యీ మృగములలో — మా తల్లిగారు నా వెంటఁ బంచిన బాలా సుందరులిరువురు మాత్రమే తోడుగా — ఆ ఫలంబులు, కాయలు, కాదలయినఁ దినక పవనజలంబుల వలనం బ్రాణధారణంబుఁ జేసికొనుచు నిట్లుండఁగా, నా మీఁద యావ గింజంత కనికరము నీకుఁ గల్గలేదు గదా। నీకుం బెరదాననైన

నా బ్రతుకేల? అదియేమో! నా దివ్యజ్ఞాన సామర్థ్యము కూడా నశించి పోయినదే! నీ వున్నచో టిదియని నిశ్చయింపఁజాల కున్నాను. పూర్ణసమాధినున్న నిన్నుఁ జూడనైనఁ గలిగిన యెడల నొక విధముగా నసురుల నిలువుకొననైన నిలుపుకొందును. ఏ ఋషియైనను నీయునికి పట్టు చెప్పువాఁడే కానరాడాయె. నీవు కైలాసంబు విడనాడితివని మాత్రము వినంబడు చున్నది. ఇప్పుడు నా కేమిగతి? ఎంత కాలమిట్లీయడవిలోఁ బడియుందును?

బాల: (రహస్యముగ) ఓసీ సుందరీ! దూర్వాసుని శాపక్రమమును గౌరమ్మతో నిప్పుడు చెప్పుదమా!

సుందరి: (రహస్యముగ) ఇప్పుడా ప్రమేయమేల చెప్పవలయును. ఊరకుండుము.

బాల: (రహస్యముగ) ఈ వృత్తాంతము చెప్పిన యెడల లేడిఁపిల్ల శంకరుని సమీపమునకుం జేరునుపాయ మాలోచించునేమో!

సుందరి: (రహస్యముగ) సరే. బాగుగనే యున్నది. వెఱ్ఱిదానవా యేమిటి? శంకరుఁ డుండుచోటే తెలియనపుడు లేఁడిపిల్లను శంకరుని జేర్చుటయెట్లు?

బాల: (రహస్యముగ) ఔను. నీవు చెప్పినదే బాగుగనున్నయది. క్రమముగా నన్నియు దైవయోగమునఁ దమంతటఁ దామే జరుగును. లేఁడికూన సంప్రాప్తమగుటకు మనము ప్రయత్నము చేసితిమా యేమి?

గౌరి: (దుఃఖముతో)

ముఖారి — చాపు

శివశివా! శివశివా! శివశివా! శివశివా!
యెవతయో యిది యని యెడఁబాసి యుంటివా? ॥శివ॥
మరుడు దుస్తరుఁడు యే—మనలేను శివశివా
పరులు నన్నెవరింక—భరియింత్రు శివశివా ॥శివ॥
పండు వెన్నెల భగ్గు—భగ్గనె శివశివా
గుండె లదరె పెదవు—లెండెను శివశివా ॥శివ॥
నడువగా నడుగులు—తడబడె శివశివా
కడలేదు విరహాగ్ని—ఘనమాయె శివశివా ॥శివ॥
నీవంటి మహాను—భావులే శివశివా
యీవేళ దయమాలి—యేతురా శివశివా ॥శివ॥
మహాదేవా! మహాదేవా! (అనుచు మూర్ఛిల్లును)

బాల: సుందరీ! ఏమిటేయిది? మన గౌరమ్మ యీలాగున నున్నదేమె? నాకేమీ తోఁచలేదే?

సుందరి: ఇప్పుడు త్వరగా శైత్యోపచారములు చేసి దీనిసేద దీర్పవలయును. నీ వీదాపున నున్న చెర్వునకుఁ బోయి కొన్ని తామరాకులను, తామరతూండ్లను గొనిరమ్ము. నేనిచ్చట మెత్తని యరటియాకులతోను, చల్లనయిన చివుళ్లతోను, పూవులతోను ఉపచారము చేయుచుందును.

బాల: అలాగే. (అని వెళ్లును)

సుందరి: (బ్రహ్మచారిం జూచి) అ పచ్చని దర్భ పట్టులనుండి లేఁడి పిల్ల దవ్వు దవ్వులకుం బోవుచున్నది. మా గౌరమ్మ ఇప్పుడున్న

విధము చూచుచున్నావు గదా! మెల్లగా నటుపోయి యా గున్న మామిడి నీడం గూర్చుండి దానిం గనిపెట్టి యుండుము.

బ్రహ్మచారి: అట్లుగానే చేసెదను తల్లీ! (అని మెల్ల మెల్లఁగా కుంటు కొనుచుఁ జెట్ల చాటునకుఁ బోవుచున్నాడు)

గౌరి: (కొంచెము కన్నుదెరచి) మహాదేవా! మహాదేవా! ఇశ్శ్—అబ్బా (సఖిం జూచి) ఏమిదే! ఈ పువ్వులేమిటి? ఈ చిగురు టాకు లేమిటి? ఛీ! పోవే. (అనుచు వానిని జిమ్మివేయుచున్నది)

బాల: (తామరాకులతోను, తూండ్లతోను వచ్చి) చెలీ సుందరీ! నీ వీ తూండ్లను దీని దేహమున నద్దుము. నేనీ తామరాకులతో విసురు చుందును.

గౌరి: (మరల కన్నుల దెరచి) చెలులారా! మన లేఁడిపిల్ల యెక్కడ నున్నదో చూడుఁడు.

సుందరి: ఆ పచ్చిక మీద మేయుచున్నది. బ్రహ్మచారి కన్పెట్టి యున్నాఁడులే. లేఁడిపిల్ల యెక్కడికిఁ బోవును?

బాల: నీ గొడవతో మేము మతులు తప్పియున్నాము. నిన్నుఁజూచినను, నీ వైఖరి చూచినను మా గుండెలు కుదుటఁబడి యున్నవా? అమ్మా! ఇప్పుడు నీకు వేఁడిమి కొంచెము పశమించినదా?

గౌరి: చెలియలారా! ఇప్పుదే కొంచెము కునుకు పట్టినది. ఆ కునుకులో నా కొక స్వప్నము వచ్చినదమ్మా.

బాల: ఏమి కల గౌరమ్మ! చెప్పు తల్లీ!

సుందరి : బహుశః మంచి కలయే కావచ్చును.

గౌరి : మంచిదో చెడ్డదో మీరే స్వప్నార్థము వివరింతురు గాక.

యదుకుల కాంభోజి — అట.

కలగంటి కలగంటి — కలలో మేలు గొంటి కదను మేలుకొంటినే.
విలసిల్లు మనలేఁడి — పిల్ల పాఱిపోయి
వెలయుచు శివదేవు — వెనుక నిల్చిన యట్లు ॥కల॥

లేఁడిపిల్ల చనిన జాడ నింగిని విని లేచి మనమందఱము
కూడిపోయి శంకరుని దర్శనము జేసి
వేడుకతో వానిఁ బూజించిన యట్లు ॥కల॥

మదనుఁడు తఱియని ప్రదరము లేయఁగ
మనసు శివునకు మెత్తనై కదలుచు మూఁడవ
కన్ను దెరచి యరగడియలోన వానిఁ గాల్చి వేసిన యట్లు ॥కల॥

పరిపరి విధముల పశ్చాత్తప్తుఁడై హరుఁడు నన్నుఁ గోరినట్లు
కదలి నే మా తండ్రి గృహము జేరిన యట్లు
తరవాత హరుఁడు నన్ బరిణయమైనట్లు ॥కల॥

నా తల్లులారా ! ఏమిచే యీ స్వప్నము ?

బాల హో హో హో !! ఎంత శుభకరమైన కల అమ్మా! నీవు స్వప్నములో గన్న వన్నియు నీకు సమకూరును. దీని కింత యాలోచింప నేల? సుందరీ! సుందరీ! మన లేఁడిపిల్ల యున్నదో లేదో చూడుము. ఇప్పుడే యీ స్వప్నఫలము తనంతట తానే తెలియుచున్నది.

సుందరి: (అటు నిటు తిరిగి, చూచి) అయ్యో! మన లేఁడిపిల్ల కనపడ లేదమ్మా! ఆ బ్రాహ్మణ బాలుఁడుకూడఁ గానరాలేదమ్మా! నడవ లేని కుంటి గదా, లేఁడిపిల్లను చూచుచుఁ గూర్చుండునని యా చెట్టు క్రింద కిట్టి పంపినాను. అప్పుడున్న తొందర చేత నొప్పగించితిని. కాని, యిట్లు జరుగునని యను కొన లేదమ్మా.

బాల: మనకు భయమెందుకు? మన గౌరమ్మ స్వప్నము యథార్థముగా భావ్యార్థమును దెల్పుచున్న దనుటకు యిదే సాక్షి గదా. వెదకుచు మన మందఱము పోదము పదుండు.

(తెరలో ఆకాశమున)

కం. మరుఁడు వటురూపధరుఁడై
హరిణకిశోరంబుఁ గొనుచు నతి వేగమ మం
దరగిరి శిఖరమున నిడెన్
హరువెనుకకు బోయి వెదకుఁ డం దుండు జుఁడీ.

గౌరి : చెలులారా ! ఈ శబ్దము విన్నతోడనే నాకు తొల్లిఁటి దివ్య జ్ఞానము మరల పొడముచున్నది. ఏమి యీచిత్రము? ఆహా ! సదాశివుఁడు మందర శిఖరమున వటవృక్షము క్రింద వీరాసన స్థుఁడై పూర్ణసమాధి నున్నాఁడు సుమా. మన మచ్చటకే పోవుదము.

బాల : (రహస్యముగా) మనమా దూర్వాస శాప విధమును గౌరమ్మ కిప్పుడు చెప్పుదమా ?

సుందరి : (రహస్యముగ) చెప్పవచ్చును.

బాల : గౌరమ్మా ! మేమొక తప్పిదము చేసినాము.

గౌరి : నా కేమియు మీరు తప్పు చేయలేదే ! అలా గందువేమి ?

బాల : మనము హిమవంతమునుండి బయలువెడలి వచ్చి బదరికాశ్రమమునఁ బర్ణశాల నిర్మించుకొని యుంటిమికదా ? అట్లుండఁగా నొకనాఁడు నీవు శివధ్యాన తత్పరవై మేను మఱచి యున్నప్పుడు మన పర్ణశాలకు దూర్వాసమహాముని వచ్చినాఁడు. అప్పుడే మేము శివపూజార్థము పూవులు గోయఁబోయి నీ సమీపమునకు వచ్చు చుండఁగా నీవు తనకు మర్యాద చేయలేదని —

గీ. మునికులోత్తము దుర్వాసమునిని నన్ను
గృహగతుం గంటఁజూడవు, కిఁడెఱుఁగవు
ధ్యానగతుఁడైన శంకరుస్థాన మీవు
తెలియఁగాలేవు నామాట తిరుగఁబోదు.

అని శపించినాఁడు. అంతట మేము భయంపడి యా మునివరేణ్యుని పాదములమీఁదం బడి ప్రార్థించఁగా,

5)

గీ. చేడెకు లభింపఁగల యట్టి లేఁడిపిల్ల
శివునిచెంగట నే శాఁడు చేరియాఁడు
తెలియఁగల దార్య యానాఁడు దేవదేవు
నునికి పట్టింక భయమేల ? యుండుఁ డెలమి.

అని శాపమోక్ష మనుగ్రహించినాఁడు. ఆ వృత్తాంత మింతదనుక నీకుం జెప్పక దాఁచినాము.

గౌరి : ఇంతేకదా. ఇది యొక తప్పుకాదు. నాకు మేలే చేసినారు. శాపమోక్షవిధమును కలిగించినవారు మీరే కదా ! తక్కిన కార్యము దానంతట నదే జరుగవలయుఁ గాని, మునిశాపము నాకుఁ దెలిసినంత మాత్రముచేతఁ జేయఁబోవునది యేమున్నది ?

(అందఱు నిష్క్రమింతురు)

# కురంగ గౌరీ శంకర నాటిక

## తృతీయాంకము

[మందరగిరి శిఖరము: వటవృక్షముక్రింద పూర్ణసమాధి నున్న శివుఁడు; వానివెనుక లేఁడిపిల్ల పూలబుంగలతో బాలా సుందరులు, శివునియెదుట గౌరియు, ప్రవేశించుచున్నారు.]

గౌరి: ఈ యలవిగాని దేవునకె ట్లుపచారములు చేయవచ్చు నమ్మా!

సీ. సిగనొక పూదండఁజేర్చి చుట్టెదమన్న
మొగి నంతరిక్షంబు ముట్టరాదు
కరముల నొక దండఁ గదియం జుట్టెదమన్న
నురగ పూత్కారంబు లొరయరాదు
గళమున నొక దండ వెలయఁ జుట్టెదమన్న
హాలాహలమ్యతు లంటరాదు
కటిసీమ నొక దండ ఘటియింతమా యన్న
వ్యాఘ్రచర్మము చూడ్కిఁ బట్టరాదు

గీ॥ అలవిగానట్టి యీదేవు నొలసి కొలువ
అబలనైనట్టి నాదు సామర్థ్యమెంత
చెంగటను దవ్వులనె నిల్చి చెండ్లనైన
నెత్తి విసరుచు శివుని పూజింతు మమ్మ !

బాల : అవునమ్మా. మన లేఁడిపిల్లను దొంగిలించి తెప్పించుకొని, వెనుకఁబెట్టుకొని మౌనముద్ర వహించిన వానివలెఁ గూరుచున్న యీ దొంగను శిక్షించవలసినదే. పెద్ద పెద్ద చెండ్లు కట్టించి నీ బలముకొలఁది విసరి కొట్టుమమ్మా ! మౌనము — మానము రెండును యొక గడియలో విడిచిపోవును.

సుందరి : బాలా ! నీవు తప్పుచెప్పితివి. మన లేఁడిపిల్లను దొంగిలించినది యెవ్వరో మనకుఁ దెలియదు. కాని, మన గౌరమ్మ మనోధనమును దొంగిలించిన దొంగ యితఁడేకదా ! ఈయన గారియందు నేరము లేకపోలేదు — ఇవిగో ! — పూలచెండ్లు — నేనే కట్టుచున్నాను. నీకు తొందరయేల ?

గౌరి : (శివునియెదుట నిల్చి).

కీరవాణి రాగము — ఆట

లేఁడిపిల్లదొంగ లేరా శంకరా
నేఁడు మా చేయిదప్పి — యేడా బోయెదవో॥
(శివుని దక్షిణపార్శ్వమున నిలిచి)
ఆఁడుదాననని — చూడవలదురా
వేడుక నిను నేను — విడిచిపెట్టనురా ॥లేఁడి॥
(శివుని వెనుకనిల్చి)

చూచినారటే! బాలా! — సుందరీ! ఇదిగో నొక గండు తుమ్మెద నా బొండుమల్లెచెండుతోడనే యీ పరశివుని చరమ జటమీఁద నిలిచినదే, తీసివేతునా?

బాల: భయ మేమమ్మా! చేతితో తీసివేయరా దటమ్మా.

గౌరి: అలాగే, (అనుచు మెల్లఁగా వెనుకజడవద్దకు చేయి సాచుచు)

కోడిగమున నీవు — కూర్చుంటివేరా

నేడు మౌనము విడ — నాడి లేరా రారా ||లేఁడి||

కాముడు: [వచ్చి, పుష్పబాణములతో శివునియెదుట నిల్చి]

కం. శివుఁడా నీ పీ ఠిఁని

నవలా మేల్పంతి నేఁచ న్యాయం బగునా?

ఇవిగో నా పూఁదూపులు

తవిలెనురా మౌనముద్ర తప్పను నీకున్.

[అని పూలబాణములు వేయును]

శివుఁడు: (కన్నులు దెరచి)

ముఖారి — రూపకము.

పో పో పోరా — చీ చీ మారా! ||పో||

నీ పోరాటము — నా పట్లనటరా యీ పూవులా—గోలలేల?

యేసెదవుర దగ్ధుడవగు మీఁక, తగదిఁక

[నిలచి] భగభగ. ||పోపో||

[మౌనము మాని రౌద్రరసముతో కనులు విప్పి]

కం. ఎవ్వాఁడవురా నను నీ

వివ్విధమున మేలుకొలుప నేటికి నాతో

నవ్వులటర నీ వింకన్
ద వ్వేడకుఁ బోయెదవుర! దగ్ధుఁడ వగుమీ.

[అని ఫాలలోచనము విప్పగా భగ్గున మంటలు గానవచ్చును. ఆ మంటలలోఁ గాముఁడు భస్మ మగును. శివుఁడు నిలిచి యుండును.]

గౌరి, బాల, సుందరి : (గడగడ వడఁకుచు శివునివెనుక భయముతో నిలిచియుందురు)

రతీదేవి : (ఆకాశమునుండి దిగుచు, మహాదుఃఖముతో, శివునియెదుట భస్మరాశియొద్ద మొగమున పయ్యెదకొంగు గప్పికొని కూర్చుండి) అయ్యో ! నా ప్రాణనాథా ! హా మారా ! హా హరికుమారా ! హా మహాసుకుమార శరీరా ! ఇంతలో నీ కీ పాటువచ్చునని కలలో నైన నెఱుఁగనైతిఁగదా. దేవాది దేవుఁడైన నీ మహాదేవు జయింతునని యెట్లు సమకట్టితివి ? నిన్నుం బ్రేరేపించిన యింద్రుకైన నేం తెలియకపోయెను ? ఆహా ! 'కాలస్య కుటిలా గతిః' యను నార్యోక్తి దబ్బర కాదుగదా. నిన్నుం గన్న యా లక్ష్మీదేవి కడుపు చలువ యింత యయ్యెనా? నీవు నన్నుఁ గళ్యాణం బగునాఁడు సమస్త దేవతలు దీవించిన దీవన లన్నియుఁ గాలికి బోయెనే ? నిత్య కల్యాణిగా నాకు ఋషు లిచ్చిన వరము లన్నియు నీటఁ గలసెఁగదా. అయ్యో ! అయ్యో ! (అని రొమ్ము మోదుకొనుచు గద్గదస్వరముతో) నీ విచ్చటికి వచ్చు నపుడు పోవద్దని గట్టిగా పట్టుకొని యడ్డగించనైన నడ్డగింప నైతిని. నేను పట్టుకొనినంత మాత్రమున కావలసిన పని కాక

యుండునా? 'యద్భావ్యం తద్భవతి' యందురు. ఇంతకు నా నొసటిరేఖ యిట్లుగా నున్నది.

"హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే"

అనెడి యార్యోక్తి తప్పునా? ఇది నా దౌర్భాగ్య దశయే యగును. శంకరునకు నీ వేమి కీడు చేసితివి? గౌరిం గూర్పఁదలంచుట నేరమా? అయినను— ఆ దయామయు డింతలోనే మూఁడవకన్ను తెఱవవలయునా? (మన్మథు నుద్దేశించి) శృంగార విగ్రహుండవగు నీయొక్క మనోహర రూపమునకా యీ భస్మీ భావము. శవాకారముతో నున్నను కొంత సేపు నీ మూర్తిని చూడనైనఁ జూతుంగదా! నీ సౌందర్యమునకు దృష్టి దోషము లేకుండ నీతల్లి లక్ష్మీదేవి కట్టిన రక్షాబంధనము నీ చేతినుండి విడిపోయెనా యేమి? సకలగుణసంపన్నా! నా మదపుటేనుఁగు గున్నా! వేలుపులమిన్నా! నిన్నా నే విడిచియుండుదానను? నీతోడనే దగ్గురాలనై నీదాపు చేరెదం గాక! [అని చితికొఱకు సమిధల నేర బోవుచున్నది.]

గౌరి: (జాలిపడి చెలికత్తెలతో రహస్యముగా) చెలియలారా! చూచితిరా? ఈ మన్మథుఁ డెంతలో భస్మమై పోయెనమ్మా! ఇందునకు నిమిత్తము నేనేకదా! నే నెంతపాపాత్మురాలను? శివ శివా! ఈ పరమేశ్వరున కిప్పుడైన దయారసము పుట్టిన బాగుగా నుండునే? — అయ్యో! నేనేమి చేయుదునమ్మా! రతిదేవి కూడ యగ్నిప్రవేశము చేయఁబోవుచున్నదే?

బాల : మన మేమి చేయఁగలము ? కాఁబోవునది చూచుచుందము.

సుందరి : స్వామికి దయ రాక యుండునా ? మనము భయపడి యేమి చేయఁగలము ?

రతి : (సమిధలు పేర్చి, యందు దుముక నుద్దేశించి యెదుట యఱ గంటంజూచుచున్న శంకరు నుద్దేశించి)

సింహేంద్ర మధ్యమము — త్రిపుట

ఈ వేళ నా విభుఁ —డేమీ పాపముఁ జేసె — ఎందుకు
మడియించితి — ఈశ్వరా ఈశ్వరా ! ఈశ్వరా !
పావనురాలైన — పర్వత పుత్రిపై — భావము గలి
గింప — పట్టుపట్టెనెగాని — ఈశ్వరా ! ఈశ్వరా !.
ఏదీ యెట్లులైన నే నగ్నిలోఁబడి — నా దైవమును జేరెదా
ఈశ్వరా ! నీదు ప్రేయసి గౌరి నీ వెన్కనున్నది — దే
దయ నీక్షించి — యేలు మింకనైన ఈశ్వరా !

శివుడు : (దయతో)

కం. ఎందుకు దుఃఖించెదవో
సుందరి ! నీ విభుఁడు నీకు సొంపుగునఁ దోఁచున్
సందియము లేదు లోకము
సందు ననంగుఁడయి బ్రతుకు నరుగుము వేడ్కన్.

రతి : మహాప్రసాదము స్వామీ ! సకలలోకేశ్వరా ! నీదయా లేశము వలన బ్రతికితి. ఇంక నాకేమి కావలయు ? వెళ్ళుచున్నాను. సెలవిండు. (అని నమస్కరించి నిష్క్రమించును.)

శివుడు : (మౌనముద్రవిడిచి, వెనుకకుఁ దిరిగి)

ఆర్యావృత్తము.

"తారావా కుసుమాంబక
కరధృతసితమండలాగ్రదరావా !
కనక లతావా నిర్జర
వనితావా తుహినపర్వతసుతావా.

(అని లేచి గౌరి కభిముఖుఁడై)

హిందుస్తానీ — కాఫీ — ఆట చాపు.

ఎవ్వతెవే యువతీ — యెవ్వతెవే యువతీ
సతి యెందు కిట సనుదెంచితివే నీవే ॥ఎవ్వ॥
లలనా మరుగోలల నా మనసు
చలనమొందెనె సరగ దెలుపుము ॥ఎవ్వ॥

గౌరి : (సిగ్గుతోఁ దలవంచుకొని నిలుచుండును)

బాల : దేవాదిదేవా ! మహానుభావా ! కండచక్కెరలపలుకుల వంటి మీ పలుకులు విని మీతో మాఱుపలుకుట కులుకు పడక మనవి చేసుకొనుచున్నాను.

కం. ఈ కన్నియ కుల్కులక
లోకేశుని ముద్దుకూఁతురు సుమీ నయో
గైకమతి నున్న దింతియ
యా కడపటి ముచ్చటలకు నర్హుఁడ వీవే॥

శివుడు : ఓహో ! ఆలాగునా ! సరే, (గౌరితో) చిన్నదానా ! నీవు చిన్నదానవుగాఁ దోఁచుటలేదే. మిన్నదానవుగాఁ దోఁచుచున్నావు.

నీ మొగము చూడఁగానే నా సమాధి యంతయు సమాధిపాలు చేసినావు. చిటికలో నా మనస్సును లాగుకొన్నావు.

సీ. మొగము చందురుసందు నగవువెన్నెలలచే
దాన! నా నెమ్మేను చల్లనాయె
చెక్కుశుక్తులమీఁది చెమరు ముత్యాలచే
నతివ! నా మదిలోని యాస హెచ్చె
బొమవిండ్ల వాలుచూపుల తూఁపులచేఁ జాలు
దొయ్యలి! నాధృతి దూలిపోయె
పెదవిబింబముపైని మృదువాక్య శుకిచేతఁ
జెలియ! నా యుల్లాస మలమికొనియె.

గీ. సహజ సకలాతిశయ విలాసముల నొప్పు
నీదుమూ ర్తిని గనుచు నే నిలువఁజాల
కొమ్మ! మనసిచ్చి నన్నుఁ గైకొమ్మఁ కౌఁగిఁ
లిమ్మఁ దయనేలుకొమ్మ రారమ్మ రమ్మ.

(అనుచు గౌరి భుజమునకుఁ దన హస్తముతోఁ బట్టబోవును)

గౌరి: (తన చేలితో శివునిచేయి వదిలించుకొని) బాలా! ఏమిటేయిది. మన మీ కారడవి కెందుకు వచ్చితిమే, వచ్చితిమి సరే—వింతగా నున్నాఁడు. చూతమని యీ తపసియొద్ద కేల వచ్చితిమే. వచ్చినవార మూరకొనక నాటలకని పూలచెండ్లేల విసరితిమే. విసరుటకేమి? — తుమ్మెద యేమి బాధ పెట్టునోయని యీ జడదారి జడ నేనేల ముట్టుకొంటినే! పుణ్యమునకుఁబోవ పాపము వెంబడించినట్లు యీ యతీశ్వరుఁడు న న్నేమో కోఁడిగాఁడుఁ

బట్టించి యాడవచ్చుచున్నాఁడు, ఇదేమి పాప మమ్మా ! ఊరక చూచుచు నిలుచున్నారు. బాగుగనే యున్నది. (కొంచెము దగ్గరగా) రారేమే తల్లులారా ! రా నిచ్చలేనియెడల నీ తపసికి సేవఁ జేయుచు మీ రిక్కడనే యుండుడు. నేను వెళ్ళుచున్నాను. (అని నడచుచున్నది)

బాల : ఏమిటమ్మా ! అంత తొందర ? ఇప్పుడేమి కలిగెను ? ఈ లేఁడిపిల్ల నీ కక్కఱలేదా ?

గౌరి : అయ్యో ! మఱచిపోయినా నమ్మా ! దాని మెడఁబట్టుకొని తీసికొనిరా.

(బాలాసుందరులు లేఁడిపిల్లను పట్టుకొను చున్నారు.)

శివుడు : నా యొద్దనున్న యీ లేఁ డి పి ల్ల ను పట్టుకొని పోవుటకు మీ రెవ్వరు ? లేచిపొండు. (గద్దించి) ఆగడము చేసితిరా – మీపని చూచుకొండు.

గౌరి : (తిరిగిచూచి) చెలులారా ! ఇదియేమి పాప మమ్మా ! ఈ యాశ్రమములో న్యాయము లేనట్లున్నది. ఎవరి సొమ్మును వారు గ్రహించుట నేరము కాఁబోలును.

శివుడు : వగలాఁడీ ! మీ తగవులు చక్కగనే యున్నవి. ఈ లేఁడి పిల్ల నీదా ? వీరిదా ?

గౌరి : ఏమమ్మా ! మాటలాడరు ? నోళ్ళు లేవటమ్మా ! నాదేయని చెప్పరాదా యేమి ?

శివుడు : నీదైనయడల నీవువచ్చి తీసుకొనిపోవచ్చును.

బాలాసుందరులు (గుసగుస లాడుకొని) ఈ తగవులు మన కేమిటికి? ఆబిదగారి లేఁడిపిల్లను యామెగారే వచ్చి తీసుకొని పోవునులే. (అని లేఁడిపిల్లను వి డి చి దూరముగా నిలచి యుందురు.)

గౌరి : సరే, మీరును మంచివారేనమ్మ. (అని వచ్చి) మృగాంకధారీ! నా వెంటవచ్చుటకు నీకు శంకగా నున్నదా—? ఇదిగో ఇఁకేమి? రా. రా. రా. (అని లేఁడి మెడ బట్టుకొనుచున్నది.)

శివుడు : (లేఁడిని చూచి) మీ చెలియ మృగాంకధారీ యనుచున్నది— నన్నా, లేఁడినా?

బాల : స్వామీ! ఈ లేఁడి మృగాంకధారి గావున నట్లు పిలుచు చున్నది.

గౌరి : (బాలాసుందరులతో) రారాదటే; యేమి ప్రసంగములు? కాముకుల చిత్తవృత్తులు 'మార్జాల కబళనన్యాయము' లని యెఱుఁగ వాయేమి?

శివుడు : (గౌరి కభిముఖుఁడై, లేఁడిపిల్ల వెనుకనుండి) ముద్దులాఁడీ! ఈ లేఁడిమీదనున్న దయ నామీఁదఁగూడ నుండవలసినదే. నీవు చెప్పిన ప్రకారము మే మిద్దఱము మృగాంకధారులమే. ఇది పశువని యందువేమో! నేను పశుపతిని.

(అని లేఁడితోకను పట్టుకొనుచున్నాఁడు.)

గౌరి : (బాలాసుందరులను జూచి) చూచుచు నూరకున్నారేమమ్మా! మీకును వేడుకగానే యున్నదాయేమి? నే నొక్కదాననే అయినా నమ్మా! ఈ మాయతపసి నిజముగా పశుపతిగానే యున్నాఁడమ్మా!

(గౌరీ శంకరులు లేఁడిని చెరియొక వైపున పట్టుకొని యుండఁగా నాకాశమునుండి)

ఓహోహో! మీ రేల తగవు లాడెదరు? మీచేతులలోని లేఁడి పిల్ల లేఁడిపిల్లగాదు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు నారాయణుఁడు. చూడుడు. (అంత గౌరీ శంకరులు తల లెత్తి చూచుచున్నారు. లేఁడి యదృశ్యమగును. నారాయణుని దివ్యమూర్తి సాక్షాత్కరించును)

నారాయణుఁడు: (గౌరీ శంకరుల నడుమ నిలువఁబడి, శంకరునితో)

చ. సకలము నీవెఱుంగుదువు శంకర! యీ గతి వేగిరింపనే
టికి నిది నీకు భార్యయగుటే నిజమైన విధిక్రమంబునన్
బ్రకటితలీల న తుహిన పర్వత నాథుఁడు దీనితండ్రి వే
డుకనీకఁబెండ్లి సేయఁగలఁడుండుము నిండుముదంబు మీఱగన్.

అదియుంగాక యీ రుద్రాణి పూర్వజన్మంబున నాకుం జెల్లెలై యున్నది. ఆ దాక్షాయణియేకదా యీ హైమవతి. కావున నేను దీనిం గొనిపోయి హిమవంతున కొప్పగించి నీ కిచ్చి వివాహంబు సేయుటకుఁ బ్రయత్నించెద.

శివుడు: కేశవా! నేను నీ మాటకు మాఱు చెప్పెదనా? అట్లనే కానిమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

# కురంగ గౌరీ శంకర నాటిక

## చ తు ర్థాం క ము

### ఒ క ట వ ర ం గ ము

[హిమవద్రాజ్యమునందు మంచుకొండ. హిమవంతుఁడు, (అతని భార్య) మేనక, (కుమారులు) మైనాక కోలాహలులు, (శృంగార వేషముతో) గౌరి ప్రవేశించుచున్నారు]

మేనక : (హిమవంతునితో) ప్రాణనాథా! మొన్నటి దినము భక్త వత్సలుండైన యాదినారాయణుండు వచ్చి గౌరిం దెచ్చి, మన కొప్పగించి, వివాహసన్నాహంబు సూచించి వెళ్ళెఁగదా! అఖిల లోకేశ్వరుండగు పరమేశ్వరునితో సంబంధము తటస్థమాయెను. ఆ పనులలో మైనాక కోలాహలులను నియమించి, శుభ ముహూర్తంబు విచారించుటకు మహర్షులను బిలిపించుఁడు. ఆలస్యము చేసిన నేమి ప్రయోజనము?

హిమవంతుఁడు : (మేనకతో) ప్రాణనాయికా! అట్లుగానే చేయు చున్నాఁడను. మనయొక్క బహుజన్మతపఃపరిపాకముననే కదా

సదాశివుఁ డల్లుఁ డగుచున్నది? అన్నిటికిని మనపాలిటి యాది నారాయణుఁడే కలఁడు. నేను ధైర్యవంతుఁడనే యగుదు. అయిన నేమి? అతి శీతబాధచే గదలలేక యున్నవాఁడ నని నీ వెఱుఁగవా? బిడ్డలు చూచిన మైనాక కోలాహలు లతి భయస్థులు, పనులన్నియుఁ గాఁగలవు. తలంకకు. (మైనాకుని బిల్చి) మైనాకా! నీవు త్వరగా మేరు మందరాది సమస్తశైలేంద్రులకును దిక్పాలకులకును శుభలేఖలు వ్రాయించి లెంకల కిచ్చి పంపించుము. భూలోకంబుల నెల్ల పట్టణంబులఁ జాటింపు చేయించుము.

మైనాకుఁడు: నాయనగారు! తమ యాజ్ఞప్రకార మన్నియుఁ జేయించెదను. కాని, యీ వివాహమునకు దేవేంద్రుఁడు మాత్రము రాకుండవలయును. అతనిపేరు వినఁగానే నా కొడలు జలదరించుచున్నది.

హిమవంతుడు: నారాయణునకుఁ జెప్పి కట్టుదిట్టములు సేయుచున్నాను. ఇక్కడికి దేవేంద్రుఁడు రావలసినదే. వచ్చినను నీకు భయము లేదు. పో.

మైనాకుఁడు: అటులైన యెడల మీ యాజ్ఞప్రకారము జరిగించు చున్నాఁడను.

హిమవంతుఁడు: (కోలాహలునితో) కోలాహలా! నీవు గౌరీవివాహమున కావశ్యక మైన సమస్త పరికరములను, వస్తువాహనములను సమకూర్పుము. మన హిమవద్రాజ్య మెల్లయెడల నలంకరింపబడునట్లు జాగ్రత్తతో గనిపెట్టుము.

కోలాహలుఁడు : అయ్యగారు ! అట్లుగానే చేసెదను. కాని, ఈ వివాహమునకు వసువులు మాత్రము రాకయుండు నుపాయము చేయవలయును. వారి పేరైన నేను విన జంకుచున్నాను.

హిమవంతుఁడు : భయము లేదు. మన నారాయణ దేవునకుఁ జెప్పి యీ పని దిట్టము చేసెదనులే. వసువులు రావలసినదే. వచ్చిన నేమి ? నీ పని నీవు చూచుకో. పో.

కోలాహలుడు : అటులైన యెడల మీ సెలవు ప్రకారము జరిగించుచున్నాఁడను.

గౌరి : (జరిగిన ప్రసంగము విననట్లు, మౌగ్ధ్యముతో తల్లియగు మేనకను జూచి) అమ్మా ! మనబాల, మనసుందరి కనపడ రేమే ?

మేనక : మన శుక్తిమతి మీవదినె. ఎఱుఁగుదువుగా. మీ వదినెను చూచి వచ్చుటకు నేనే మన బాలను, సుందరిని పంపించినాను.

గౌరి : ఎందుకు ?

మేనక : శుక్తిమతివదినె తన పుట్టిన యింటికి నీళ్ళాడబోయి యాఱు మాసములైనది. ఇంకను తీసుకొని రాలేదు. ఇప్పుడు తీసుకొని రాఁబోయినా రమ్మా.

గౌరి : శుక్తిమతివదినె బిడ్డను కన్నదా ?

మేనక : కన్నది తల్లీ !

గౌరి : కూఁతురా ? కొడుకా ?

మేనక : కొడుకా ! — అంతమాత్రపు నోములా ? — ఆఁడుపిల్లలు.

గౌరి : పేరు పెట్టినారా అమ్మా ?

మేన : ఏమో ! ఆ పుట్టినింటివారే పేరు పెట్టుకున్నారఁట.

గౌరి : ఏమి పేరో !

మేన : గిరిక యఁట.

గౌరి : అమ్మా ! గిరిక మనయింటికి నెప్పుడు వచ్చును ?

మేనక : తల్లీ ! నీ వివాహము గాఁబోవుచున్నదిగా. ఆ నాటికి వచ్చు నమ్మా.

గౌరి : (సిగ్గుతోఁ దలవంచి సంతోషము) నేను పూలతోటకుఁ బోవలయును. నాతో నెవ్వరినైనా పంపవూ ?

మేనక : మన మాలతిని, వకుళమాలికను పంపెదనే తల్లీ !

హిమ : (మేనకతో) ప్రేయసీ ! మనపాలిటి యాదినారాయణదేవు నారాధించు సమయ మగుచున్నది గదా ?

మేనక : పోదము ప్రాణనాథా !

(అందఱు నిష్క్రమింతురు)

## రెండవ రంగము

[కైలాసపురమున పరమేశ్వరుఁడు, భృంగి ప్రవేశించుచున్నారు]

శివుఁడు : ఓరీ ! భృంగి ! నేను సమాధి విడిచి వచ్చితిని. ఎందుచేత విడిచి వచ్చితినో దెలియునా ?

భృంగి : దేవరవారి వృత్తాంతము లోకవిదితమే – జనులు చెప్పుకొనఁగా విన్నాను స్వామీ!

శివు : అప్పుడే యీ వృత్తాంతము లోకవిదిత మైనదా ?

భృంగి : ఆఁ! లోకవిదితమే యైనది. అయ్యో! నా కొక సందేహము బాధించుచున్నది.

శివు : ఏమి సందేహము ?

భృంగి : వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత నీలాది మాణిక్యంబుల కునికిపట్టై, మహా భాగ్యవంతుఁడని కీర్తి వహించిన హిమవంతుఁ డెక్కఁడ ? పుఱ్ఱెల దండ, పులితోలు పచ్చడము, భుజంగ భూషణములు, జంగము వేషము, శంఖ నాదము, చంకఁజోలె – మన మెక్కఁడ ? – అటో్చ తూఁగ గలమా ? ఈ వియ్య మెట్లు కొనసాఁగునో ? తెలియకున్నది. "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే" అన్నారు. మీ రేమి యాలోచించినారో, యేమో! గాని నా మట్టుకు సందేహముగా నున్నది. తుదకు మన ప్రమథ గణములతోనూ, మన పిశాచములతోనూ, మన వెల్దెద్దూ, మన గంతా – బొంతా వేసుకొని తరలిపోదిమా! నలుగురును చూచి నవ్వుదురేమో! దానికేమిగాని, మంగళసూత్రము, మట్టెల మట్టుకైనా యేమైనా చేతిలో నున్నదా ?

శివు : ఓరీ! నీ వట్లేల సంశయించెదవు ? అష్టైశ్వర్యములును మన వశములోనే యున్నవని నీ వెఱుఁగవా ? మన మేది దలఁచిన నది సమకూడును. చింతపడకుము.

భృంగి : అటులైనయెడల నేను మీ పెండ్లికి వచ్చునపుడు మా రీకుగా నుండవలయును సుమండీ! చేతులకు బంగారు కడ్డీ మురుగులు — మొలకు బంగారు గొలుసు మొలత్రాడు — చెవులకు రవ్వల తమ్మెట్లు — పది వ్రేళ్ళకు నుంగరాలు — కట్టుకొనుటకు మంచి జరీ దోవతులు — మొఖమల్ అంగీ — బనారసు వోణీ — తలకు మధిర రుమాలు — కొనచెవికి జంపుగూడా యున్నయెడల బాగుగా నుండదు అయ్యగారూ!

శివు : భేష్! మా బాగుగా నుండునురా. అలాగే నీకు కలుగును పో. ఈ వెఱ్ఱి మొఱ్ఱి మాటలకేమిగాని ఆ గౌరిని నీవు చూడలేదు గదా!

భృంగి : చక్కనిదనియో, కానిదనియో మీ తాత్పర్యము. సెల విందు.

శివు : చక్కనిది కాకున్న దానిని నేను స్మరింతునటరా.

భృంగి : ఇంకనేమి? మీ కన్నులకే యామె చక్కఁగా నున్నప్పుడా చిన్నది త్రిలోకసుందరియే యనవచ్చును.

శివు : ఓరీ! అరణ్యవాసము చేయుచు, వాయు జలంబులు మాత్ర మాహారముగాఁ గఠినవ్రతంబు సేయుచు నారచీర కట్టుకొని యున్నప్పుడే నా కది త్రిలోకసుందరిగా కానవచ్చినది. ఇప్పుడు దాని సౌందర్య మెవ్వరు వర్ణింపఁగలరు?

భృంగి : ఎవ్వఁడును వర్ణింపలేఁడు. (మెల్లగా) మీరు తప్ప.

శివు : ఆ జగన్మోహనాకారమును నే నెప్పుడు చూచెదనో కదా?

భృంగి : ఇంత తొందరయేల? నేఁడో రేపో లగ్నపత్రిక రానై యున్నది గదా!

శివు : ఓరీ! భృంగీ! ఆ గిరిబాలకన్యక యిప్పు డెక్కడ నున్నదని నీవనుకున్నావురా?

భృంగి : మంచుకొండమీఁద నున్నదనుకొన్నాను స్వామీ!

శివు : కాదు. తప్పు చెప్పినావు. నీకుఁ దెలియదు. నా హృదయమందే యున్నది.

భృంగి : (అదరిపడి, వడిగా నడచి) ఏదయ్యా! - ఏదయ్యా! (అని శివుని వక్షస్థలమువంకఁ జూచును.)

శివు : హృదయమనఁగా మనస్సురా.

భృంగి : అలాగా! సరే. సరే. మొదట తొమ్మెక్కి త్రొక్కుచున్న దనుకున్నానయ్యా.

శివు : భృంగీ! ఇటు విను.

ఉ. ముద్దియ నాదు కన్నులకు ముందర నిల్చినయట్లు జాళిమై
నిద్దపు చెక్కుటద్దముల నిండిన చెమ్మట పైఁటకొంగుతో
నద్దిన యట్లు కన్గొనల నార్చి ననుం గనుఁగొన్న యట్లు నేఁ
డద్దములోనఁ బోలె హృదయంబునఁగన్పడు నేమిచెప్పుదున్!

ఆ వన్నెలాఁడి కతంబుననే మన్మథుని రూపుమాపితిని. కాని, రతివిలాపంబునకు జాలిపడి తిరుగ బ్రతికించితిని ఆ వైరంబుననకా తోఁచుచున్నయది వాఁడు నన్నుఁడికింప మొదలుపెట్టినాఁడేమి?

భృంగి : (దుడ్డుకఱ్ఱ చేతఁబట్టుకొని, వీరరసముతో) ఏడీఁమన్మథుఁడు! కనపడఁడేమి? వాఁడు నా కన్నుల బడఁడాయెఁగదా! ఈ కఱ్ఱతో బుఱ్ఱఁ బగులవేతునే!

శివు : (మన్మథు నుద్దేశించి)

ఉ. ఓరిరమాకుమార! భవదుద్యమ మెంతయుశ్లాఘ్యమౌఁగదా
గౌరికి మేలుకూర్ప నను గారియఁబెట్టుటఁ జేసి కాని నా
గోరముదీర్పగాఁదలపఁగోర వదేమిర? యేటిన్యాయము? అ
గౌరిపయిన్ శిలీముఖనికాయములేమియు నమ్మఁద్రోవుమీ.

ఓరీ భృంగి! నే నీతమక మెట్లు సహింతును?

ఉ. పిచ్చితపంబు నేఁ బయిన బెట్టుక చూచియుఁ జూడనట్లుగాఁ
బుచ్చితికాలమున్ మగుద పూజలు సేయుచు ద్రోలనుండఁగా
గ్రుచ్చి కవుఁగలింప కిటుగొట్టుకొనన్ నగుఁబాటుచేటికిన్
వచ్చిన ద్రోచి దూరమునఁ బడ్డపు దేవ్చెడి బిడ్డపోలికన్.

(ఆకాశముపంందు)

మహాదేవ సందర్శనార్థము సప్తర్షులు కైలాస శిఖరమునకు
వచ్చియున్నారు.

భృంగి : (ఉలికిపడి) అయ్యగారి రొట్టె నేతిలోఁ బడ్డది. ఇఁక నేమి? ఏదో శుభవార్త మూటకట్టుకొని వచ్చినారు.

శివు : ఓరీ భృంగి! హిమవంతుఁడు నా వివాహ విషయమై శుభ పత్రికా సహితముగా సప్తర్షుల నంపియుండును. త్వరగా వారిం గొనిదెత్తము. పద.

భృంగి : అయ్యగారు! ఇన్నాళ్ళమండి మిమ్ముం గనిపెట్టుకొని మీ మడిసంచి, దర్భాసనాలు మోచి మోచి భుజాలు కాయలు గాచినవి. నా పెండ్లికూడా చేయించరుగా?

శివు : నా పెండ్లయైన తర్వాత నీ పెండ్లిమాట యాలోచింతము. పదరా మాటలాడక!

శృంగి : అయ్యగారూ! మీకు అష్టైశ్వర్యము లఱచేతిలో నున్నవి. గనుక కట్నములు కానుకలు పెట్టి యన్నిఖర్చులు వారే పెట్టుకొని పిల్లనిచ్చి పెండ్లిచేసి తర్వాత వారియింటనే యుంచుకొనెదరు. మంగళసూత్రమునకు బంగారు కొంత, మట్టెలకు వెండి కొంత యున్నది. నా బోటి ప్రేమ్యుఁడైన దరిద్రునకు చిన్నది కుదురుటయే కష్టము. కుదిరినను దానియత్తు సొమ్మియ్యవలయును. శాస్త్రీయములగు అక్షతా వివాహములకు ఆచార పిశాచమును ప్రతిబంధకములుగా మీరే పంపియున్నారు. — సరేగాని, అయ్యగారు! ఆ పిశాచమును మాత్రము వదలించితిరా! ఓలి తెచ్చుకొనలేని నా వంటి వాండ్రకు క్షేమముగా నుండును.

శివు : ఓరీ! ఆ విషయమై త్రిమూర్తుల మాలోచించుచునే యున్నాము. క్రమ క్రమముగా జరుగఁగలదు. నీ వేమియు భయపడవలదు.

శృంగి : అట్లైనయెడల నా బోంట్లము బ్రతికిపోయెదము స్వామీ! త్వరగా ఆ విషయమును సిద్ధాంతపఱచిన యెడల నే నొక యక్షతా వివాహము నేఁడే చేసుకొని నక్షత్రముగా పెండ్లికి రావలయునని యున్నది.

శివు : అం తాతురత యేమిరా! — త్వరగా నడువుము; ఋషులు వచ్చియుందురు.

శృంగి : (మూతి విరుచుకొని మొగము ఓరగా త్రిప్పి) నా పెండ్లి జోలి నీ కేమయ్యా! నీ పెండ్లి చేసుకోబాబూ. లోకములో గొప్పతనము హెచ్చినకొలది స్వార్థపరాయణత్వము కూడ

హెచ్చునునే యున్నమాట నాకుఁ దెలియును. మీ ముగ్గురు మూర్తులకును పరోపకారబుద్ధియే యున్నయెడల లోకములోని వా రందఱును పరోపకారులే యగుదురు. లోకము బాగుపడనే బాగుపడును. — అయ్యగారూ! ఇదే దారి. దయచేయుఁడు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## మూఁ డ వ ర ం గ ము

[హిమవంతము : పుష్పవనము, గౌరి, (గౌరి చెలికత్తెలు) మాలతి, వకుళమాలిక ప్రవేశించుచున్నారు.]

గౌరి : రావే మాలతీ! రావమ్మా వకుళమాలిక! ఆ సదాశివమూర్తికి పూజ సేయుటకుఁ బూవులు కోయుదము.

శ్యామ — అట

ఇవిగో మల్లెలు యివిగో జాజులు
యెన్నో యిచ్చట కలవే కలవే కలవే॥

మాలతి : ఇవిగో విరజాజు లివిగో సంపంగు
లెంతో చక్కఁగ నున్నవే ఉన్నవే ఉన్నవే॥

వకుళ : ఇవిగో ఉమ్మెత్త లివిగో తుమ్మి జిల్లే
డెంత సొగసు చూడరే చూడరే చూడరే॥

మాలతి : గౌరమ్మా చూచినావటమ్మా దీని దుండగము! ఇదేమిటమ్మా పొగడలు, బొడ్డుమల్లెలు, మల్లెలు, జాజులు మొదలగు సుగంధ ద్రవ్యములు కొల్లలుగా వెల్లివిరిసియుండగా నుమ్మెత్తలు, తుమ్మి

పూలు, జిల్లేళ్ళు కోయుచున్నది. (వకుళమాలికను గద్దించుచు) ఊరుకో! ఏమిపని అది. ఆ పూవులు గోసెదవేమి? ఏమి చేసికొనెదము?

గౌరి : అయ్యో! దానిమీద కోపగించెద వేమే మూర్ఖురాలా! ఆ పరమశివునకు ద్రోణార్క పుష్పములయందు ప్రీతియని నీ వెఱుగవా? (వకుళమాలికతో) కోయుము. వకుళమాలికా తప్పు లేదు. మాలతీ! ఇదిగో మాలతి — ఆ తీగెపేరేమి?

మాల : ఏ మాక్షేపించెదవమ్మా! దానిపేరు నా పేరు నొకటే యనియా! నే నెంత శాస్త్ర పురాణములు చదువకున్నను నింత మాత్రమైనఁ దెలిసికొనకుందునా?

గౌరి : అవునుగాని, నా చేతిలోని దేమిటో చెప్పు?

మాలతి : (వకుళమాలిక వంకఁ జూచి నవ్వి) ఇదిగో యీబిడగారు మనతోనే యున్నదిగా?

గౌరి : ప్రొద్దెక్కుచున్నది. — త్వరగా —
ఇవిగో గొజ్జంగు లివిగో కలిగొట్టు
లెన్నిగోసిన తఱుగవే, తఱుగవే, తఱుగవే॥

మాల : ఇవిగోనే మంచి కేతకీసూనము
లేమి వాసన గ్రమ్మెనే, గ్రమ్మెనే, గ్రమ్మెనే॥

గౌరి : (పరాకుగా నుండును).

వకుళ : ఏమి సంస్కృతమే మాలతీ! కేతకీసూనము లేమిటి?

మాల : అయ్యో! ఇంతేనా? నీవు సంస్కృత ప్రాకృతము చదువనే లేదా?

గౌరి : మాలతీ! కోసితివా యేమి? అవి ముట్టరాదు. ముట్టరాదు. పాఱవేయుము. పరశివునకు మొగలిరేకులు గిట్టవని యెఱుఁగవా?

మాలతి : గౌరమ్మా! కోపము చేయకు. నేను శాస్త్రపురాణాలు యింకను చదవలేదమ్మా. నన్నేమియెదవుగాని వకుళమాలిక కేతకీసూన మనఁగా నేమిటని నన్నడిగినది.

వకుళ : సరే. లేందమ్మా! నాచదువేయడుగవలె. మాయమ్మ యూఁద వాండ్రకు చదు వేమిటని యనుదినము పోరు చేయుచున్నది. అయ్య నన్ను బడి మాన్పించునఁట. ఇఁక నింతే నాపని.

మాల : పోనీలే. తల్లిదండ్రుల నేటికి నిందించెదవు? పెనిమిఁటి వద్దకుఁ బోయిన తర్వాత నీవు బుద్ధిమంతురాలవైన యడల విద్యను వృద్ధిపొందించుకోరాదా యేమి?

గౌరి : ఏమిటే మాలతీ! మాటలతో ప్రొద్దుఁబుచ్చుచు పూలు గోయరా యేమి?

మాలతి : (వకుళమాలికతో) ఇదిగో! చూచినావా? ఈబిడె స్వార్థ పరాయణత్వము! ఈమెకు సంగీతసాహిత్యాది సమస్తవిద్యలు వచ్చునని లోకమున కంతకు విశదమే. మనకు రావాయనని లేశమైన విచార మున్నదేమో చూడు.

గౌరి : మాలతీ! నీ గడుసుమాటలు మాని పూలుకోయవే. పరశివుని బూజింతము. స్త్రీలు విద్యావతులు కావలయునని మ్రొక్కుకో. నీ కోరిక సఫలము కాకపోదు. (వకుళమాలికతో) నాకునాకోరికలు

చెల్లించి విద్యావృద్ధికి యర్థుకలుగఁ జేయని యత్తమామలును, భర్తయు కలుగవలయునని మహాదేవునకు మ్రొక్కుకొందురుగాని, పూలు కోయుఁడు.

మాల : కోసితిమమ్మా కోసితిమి. ఇదిగో చూడు. చాలవు?

వకుళ : నేనే యెక్కువ కోసినాను. చూడు గౌరమ్మా!

మాల : ఉమ్మెత్తలు. తుమ్మలు, జిల్లేళ్ళు కోయుట కూడ నొక యెక్కువగా చెప్పెదవేమే. వకుళమాలికా! నేను కోసినవి చూడు! విరజాజులు — సంపంగులు —

గౌరి : మన కిప్పుడు చూడుము! ఎన్ని మాలతులో!! ఎన్ని వకుళ మాలికలో!!! ఇఁకఁ బరమేశ్వరుని బూజింతమా?

(మాలతీ వకుళమాలిక లొకరి ముగము లొకరు చూచి నవ్వుకొందురు.)

వకుళ : గౌరమ్మా! పరశివుఁడెక్కడున్నాఁడని పూజచేయగలవమ్మా!

గౌరి : తెలివిగలవారు జ్ఞానదృష్టిచే పరశివుని సర్వత్ర కనుంగొని యెదరు.

వకుళ : నీవు తెలివిగలదానవు గనుక నిప్పుడున్న (మెల్లగా) ఉద్రేకములో (బిగ్గరగా) నెక్కడ చూచిన పరశివుఁడే. ఆ పరశివుఁడు మాకెన్ని తపస్సులు చేసినఁ గానవచ్చునమ్మా.

గౌరి :

శ్లో॥ "జగ ద్గత మితి ప్రధాం నయతి వస్తుదైవం శుభం
జగచ్ఛంతి సర్వదా నిగడితం నదైవం తథా,

జగచ్ఛ్రుణుత సేవ్యతా మమలదైవ బుద్ధ్యాతతో
మనో మల విశోధనం విహిత విగ్రహారాధనమ్"

కావున నీ గుజ్జుమామిడిక్రింద పరిశుద్ధముచేసి యీ లింగమును స్థాపించుఁడు. ఇతఁడే పరశివుఁడమ్మా.

వకుళ : (గౌరితో) ఈ రాతిలింగమునేనా నీవు పెండ్లాడఁబోవుచున్నది?

మాల : (వకుళమ లికను గద్దించి) ఊరుకోవకుళా ! అలా గనవచ్చునా! చిన్నతనము విడువ లేదుగదా — చెంపలేసుకో.

వకుళ : (చెంపలు వాయించుకొని నమస్కరించును.)

గౌరి : "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను మహావాక్యార్థము వలనను "జన్మాద్యస్యయతః" యను వేదాంతసూత్రము వలనను సమస్త జగత్తునకు నుపాదాన కారణుఁడై భగవంతుఁడైన పరశివుఁడీ రాతి యందే లేకున్న నీ జగత్తునందంతట నుండుటెట్లు ? సర్వమునకు నుపాదానకారణమైన వస్తువు సర్వముయొక్క అవయవములయం దేలయుండదు ?

మాల : ఉపాదానకారణ మనఁగా నేమి గౌరమ్మా ?

గౌరి : వస్త్రమునకు దూది, ఘటమునకు మృత్తు, నుపాదానకారణము. దృశ్యమంతకు పరశివమూర్తియే యుపాదానకారణము. ఈ శిలను శిలాబుద్ధిచే పూజించుటలేదు. పరశివబుద్ధిచే పూజించు చున్నాము. (అని మామిడిచెట్టు క్రింద లింగప్రతిష్ఠచేసి) రావే మాలతీ ! రావమ్మా వకుళమాలిక ! ఆ సదాశివమూర్తి దర్శనము మరల నా కెప్పుడు కలుగునో ! నా భాగ్య మెట్లున్నదో !!

వకుళ : ఇదిగో ! ఇక్కడనే యున్నాడుగా ! (మెల్లగా) ఈ లింగ మూర్తిని మెడకు గట్టుకోరాదు ?

మాలతి : (వకుళమాలికను కనులతో వారించి గౌరితో) గౌరమ్మా ! ఏమమ్మా అంత తొందర ? నీ వివాహ ప్రయత్నము జరుగఁబోవుచునే యున్నదిగా !

వకుళ : (మాలతితో) ఏమి వగలాఁడమ్మా యిది ? అన్నము నాకులో వడ్డించుకొని యాఁకలి కొర్వలేనని మొఱపెట్టుకొనుచున్నది.

గౌరి : కాదమ్మా ! మా తండ్రిగారు పెద్దవారైనారు. లోపల తాపము, బయట శైత్యము. కదలలేరు. వారేమి సేయుదురు ? మా యన్నలు మైనాక కోలాహలు లున్నారు. ఒకరు సముద్రమునను, వేఱొక రేటియొడ్డునను కాపురమున్నారు. బయటికి బయలుదేర భయము ! మా యమ్మగారు తొందరపడుచునే యున్నారు. కాని, ఆఁడుది. ఆమె యేమి చేయఁగలదు ? అమ్మలారా ! మీకేమి తెలియును మా గృహ కృత్యములు ? అదనారాయణమూర్తి వచ్చి వివాహప్రయత్నములు త్వరగా జరిగించుకోవలసినదని చెప్పివెళ్ళి యిప్పటికి నెల కావచ్చినది. వారు క్రిందటి నెల పౌడుపునాఁడు చెప్పి వెళ్ళినారు గదా. ఈనాఁటి కింకను నే పనులును జరుగలేదు. అయ్యో ! నే నెట్లు సైరింతునే ? ఒక గడియ యొక మహా యుగముగా నున్నది. అదియేమో కాని నా తమకమునకు మితిలేదే !

వకుళ : (మెల్లగా మొగము వెనుకకుఁ ద్రిప్పుకొని) అలాగే యుండును. ఈడు ముదిరినదిలే. అందఱి లాగున నతి బాల్య వివాహము జరిగిన యెడల ఈ కర్మము లేకపోవును.

గౌరి : వకుళమాలికా! నా క్షేమో తాపముగా నున్నదే. ఆ మహా దేవుఁడు తనంతట తానైన వచ్చి నా కన్నులకుఁ బునర్దర్శన మియ్యఁడాయనే.

వకుళ : (మెల్లగా వెనుకకుఁ దిరిగి) ఆ సదాశివుఁడు ఈ కాలపువాఁడు కాఁడు. ఈ కాలపువాఁడేయైన యెడల నిదివఱకే ఈ పూలతోఁట లోనికి నెన్నిసారులో వచ్చుచుఁ బోవుచుండును.

గౌరి : చెలులారా! నే నిలువలేనమ్మా.

హిందుస్థానీ భైరవి — రూపకము.

తాళలేనే, తాళలేనే, తరుణి యేమి సేయుదునే
కాలకంధరునితోడ కలసి ముచ్చటలాడక నే ||తాళ||

మక్కువతో వాఁడు నేను మిక్కిలీ వేడుకతో
నొక్క ప్రక్కమీఁదనుండి వక్కలాకు లివ్వకే ||తాళ||

వకుళ : (రహస్యముగా) మన్మథుఁడు మేరమీఱ లేదాయేమి? పాపము! శరీరహీనుఁడై పోయినాఁడు. చల్లని తల్లివి. నీ శివపూజామహిమ మన్మథునిమీఁదుగాఁ బాఱినది. చావు దప్పి కన్ను లొట్టబోయె నన్నట్లయింది.

మాల : (నవ్వుచు. మూతిపై బట్టవేసుకొని దూరముగాఁ బోవుచు, మెల్లగా) ఊరుకో వకుళా! ఊరుకో, గౌరి వినును.

గౌరి : (మన్మథు నుద్దేశించి).

ఆ. వె. శివుని కంటిమంటచేఁగాలి మరల న
న్నేచ బ్రతికితో మహేశు కరుణ
బ్రతికియున్నవారిపై దేవుకరుణ రా
దనుచు నన్నుఁ బ్రేమఁ గనఁ దలంతొ !

(ఆ కా శ ము న)

హిమవత్కూటమున కాదిదేవుఁడగు నారాయణుఁడు వచ్చుచున్నాఁడు. గౌరీవివాహ మహోత్సవము కొఱకు సమస్త కృత్యములు నెఱవేర్పఁబడినవి. నేఁటిమాపటికే వివాహ మహోత్సవము హో !!

గౌరి : వింటిరా ! మనము త్వరగా పోవుదము పద.

కమల : మాలతీ ! పెండ్లి అనగానే గౌరమ్మ కెంత సంతోషమో చూడు.

మాలతి : గౌరమ్మను ఆలాగనెదవేమి ? — గౌరమ్మా ! ఇదిగో ఈదారివి రా.

(అందఱు నిష్క్రమింతురు)

## నాలుగవ రంగము

[హిమవత్పర్వతము : కళ్యాణమంటపము : హిమవంతుఁడు, మేనక, మైనాక కోలాహలులు, నారాయణుఁడు, గౌరీశంకరులు, బ్రహ్మ, ఋషిపత్నులు ప్రవేశించుచున్నారు.]

ఋషిపత్నులు : (హారతిపళ్లెము పట్టుకొని)

సురటి — ఆట

పరమేశ ; హతమోహపాశ ! ఈశ ! శుభమంగళమ్,
జయమంగళమ్

గిరిరాజాసుత సర్వగీర్వాణనుత జయమంగళమ్
నిత్య శుభమంగళమ్.

౧. శూలాయుధ భూతజాలనాథ జయమంగళమ్
నీలాలకవాణీ జితశుక జయమంగళం శుభమంగళమ్

౨. విషముగ్రోలి దేవవితతినేలిన దేవ మంగళమ్
వృషభాతురంగుని పెండ్లాడిన దేవి మంగళం శుభమంగళమ్

మేనక : గౌరీశంకరుల నాశీర్వదించి యక్షఁతలు వేయుఁడు తల్లులారా!

(ఋషిపత్నులు గౌరీశంకరుల కన్నులకు మంగళహారతి నద్ది, శిరముల నక్షఁతలు వేయుదురు.)

బ్రహ్మ : సకలలోకము లే మహాదేవుని కళ్యాణముగోరియున్నవో యట్టి లోకములకు మంగళము కలుగునట్లుగా గౌరీశంకరు

లానందమయమైన గృహస్థాశ్రమమునఁ బ్రవేశించిరి. ఈ సమయము పురస్కరించుకొని నేను భరతవాక్యము చదువుచున్నాను.

గీ. ధ్యాన యోగ సమాధుల దైవవిధుల
సకల భూతాళిమేలును సరవిఁగోరు
నాత్మహృద్ధ్యాన తేజులు నమరియుండఁ
బాడి పంటలు పృథివినిఁ బండుఁగాక !
భూతపంచకజాలంబు పొదలుఁగాక ।

అందరు : తథాస్తు. తథాస్తు. తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ